# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 22 సెప్టెంబర్ 1979 సంచిక 9

## విషయానుక్రమణిక



**-: శ్రీవారి కార్యక్రమములు :-**

బాబావారు ప్రశాంతి నిలయమునందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

**చందాదారులు గమనించండి!**

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆనెంబరు "..../-10-1979" అనియుండిన, మీచందా అక్టోబర్ నెలతో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) సెప్టెంబర్ నెల 30 వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి



మధురాధిపతే రఖిలం మధురం




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

ఇహలోకములోని ప్రభువే ఇన్ని కట్టు దిట్టములు ఏర్పరచి దేశక్షేమ పరిపాలనను గావించుచుండ సర్వలోక శరణ్యుడైన భగవంతుడు, జగత్పరిపాలకుడు, లోకనాథుడు, విశ్వనాథుడు సృష్టి తంత్ర నిర్వహణమునకు నిర్దుష్టమైన కట్టుబాట్లు విధులు యెన్నినియమించవలసియుండునో యోచించుడు. సృష్టిక్రమము అనేక శాఖోపశాఖా సమన్వితము. ఏ శాఖ కాశాఖ విభజింపబడియున్నది. ప్రతిశాఖకు అధిపతులు వారికి తగిన పరివారము తగిన రీతిగా నేర్పాట్లు జరిగియున్నవి. ఇక్కడ భక్తుల ప్రార్థనలు ఏ శాఖకు చెందినవో ఆ శాఖకే అందజేయవలసి యుండును. కనుక అజ్ఞానముననో, పొరపాటుననో వేరొక శాఖకు పంపబడిన యెడల ఆ శాఖాధిపతి యేమిచేయును? ఆ పత్రము తనశాఖకు చెందినది కాదనియును, దానిలో తనకేమీ సంబంధము లేదనియును దానిలో జోక్యము కలిగించుకొనక ప్రక్కకు నెట్టును, కావున మన ప్రార్థనలు ఏ శాఖకు చెంది యుండునో ఆ శాఖకు మాత్రమే నియమితములు. వర్షమునకు వరుణుడు ప్రభువు. ఈ వర్షమునకు సంబంధించిన ప్రార్థన వరుణుని శాఖ. దానిపై అతనికి మాత్రమే అధికారము. అటులనే సూర్యుడు తేజ ఆరోగ్యముల కధిపతి. గణపతి విఘ్నశాఖాధికారి. సస్యములు భూదేవి పంట, ఓషధులకు చంద్రుడు. ఇటులనే వివిధ శక్తులకు వానివానికి తగిన అధిపతి కలడు. వీరికి అధిష్ఠానదేవతలు కలరు. వారిని అధిష్ఠాన అధిపతులని అందురు. మన ఇంద్రియ శక్తుల కన్నింటికినీ ఒకొక్క అధిష్ఠాన దేవత కలదు.

"అయితే దేవుడొక్కడే కదా. ఆయనను ప్రార్థించుచుంటిమికదా. ఇక మన కోరికలు తీరకుండ యెట్టిది?" అనిఅనుకొనుట పొరపాటు. అదియే మనలోని బలహీనత. దేవుడొక్కడే. నిజమే. ప్రధాన మంత్రి, లేక రాజు ఒక్కడే. కానీ శాఖలు వేరు వేరు అని గ్రహించలేక పోవుచున్నాము. ఎవరికో జాబువ్రాసి మరొకరి అడ్రసుకు పోస్టుచేస్తే అది యెవరికి పోయి చేరును? అడ్రసు కలవానికి చేరునేకానీ అసలు వానికి చేరదు. అదే విధముగా నీప్రార్థన యెవరికి సంబంధించినదో ఆ శాఖాధికారికే నీవు అడ్రసు చేయవలసియుండును, అనగా విలాసము వ్రాయవలసి యుండును. అట్లు వ్రాసినప్పుడే ఆ విషయము అతనికి చెందును, దానిపై అతను చర్యను తీసికొనును. మన మనోరథము సిద్ధించుటకు మనము అర్హులమా? కాదా యని విమర్శించుకొనుట అత్యవసరము. మనలోని భావములు సంకల్పములు, కోరికలు, దృఢవిశ్వాస పూరితములగునో కాదో తెలిపోవును. ఇందుకు భగవంతునిచే యేర్పడిన క్రమ విధానాచరణమే గీటురాయి. మన సంకల్పములు దృఢమై, పవిత్రమైన అతని కరుణా కటాక్ష వీక్షణముల నాకర్షించుకొనశక్తిమంతములగును. కర్మకాండ మానవాభ్యుదయమునకు జీవగఱ్ఱ. బ్రతుకునకు వాయువు, ఆకలి నివారణకు అన్నము, దాహశాంతికి జలము, ఎట్టి సంబంధమున నున్నవో మానవునకును అతని పరమార్థమునకును మధ్య కర్మకాండ యట్టి సంబంధమున గలదు. అందువలన వేదచోదిత కర్మానుష్ఠానము మన కర్తవ్యము. భగవంతునకు చేరు కర్మలు మూడు కలవు. నిష్కామకర్మ, నిస్స్వార్థప్రేమ, నిర్మల హృదయము నుండి వెలువడు ప్రార్థన. ఇవి మాత్రమే భగవంతుని శాఖలు. ఈ విధమైన ప్రార్థనలు సరాసరి భగవంతునకు చేరును. కాన భక్తులు చేయు ప్రార్థనలు, నిస్స్వార్థ, నిర్మల నిష్కామమైనవిగా నుండవలెను. లేనిచో అవి భగవంతునకు సరాసరిచేరవు. మరొక అధిష్ఠాన దైవము - అనగా - మరొక శాఖకు చెందిన వగుటచే అవి దైవమునకు చెందజాలవు.

శాస్త్రమనగా శాసించునది. ఆహారము తినుటకు వంట వండుకొనుము. పొలము చక్కగా దున్ని పండించుము. ఇట్టివి శాస్త్రములు ఉపదేశించనవసరము లేదు. అప్పుడు పుట్టిన లేగ దూడ తల్లి స్తనమును నోటనిడక పూర్వమే ఆ స్తనములలో దూడ క్షుద్బాధ నివారణార్థము క్షీరము అమరియుండును. ఈ విషయమెంత మహా సిద్ధాంతమును సూక్ష్మముగా వెల్లడించుచున్నదో గమనార్హము. జీవుని భుక్తి అతని తోడనే కలదని విశదమగుచున్నది. భుక్తి ముందు జన్మించుచున్నది. పిమ్మట జీవుడు జన్మించుచున్నాడు. జీవుని భోజ్యభోగములు అతని పూర్వ కర్మాధీనములు. వీనికొరకు ఆచరింపబడు కర్మ నిమిత్తమాత్రము. మానవుడు తన బుద్ధిని ఉపయోగించుకొని లోక వ్యవహార కర్మ నాచరించు కొనుచుండును. మానవులకు తెలియనివి, బుద్ధికి గోచరము కానివి, అసాధ్యమగునవి, మానవాభ్యుదయము

నకు మార్గదర్శకమైనవి, అట్టివాని ఆచరణ విధానములను వేదములు తెలుపుచున్నవి. శాస్త్రములు నిర్ణయించుచున్నవి. కావున మానవ శ్రేయమునకు లౌకిక కర్మలెంత ముఖ్యమో వైదిక కర్మలుకూడా అంతముఖ్యం. వైదిక కర్మలయొక్క ఫలమంతా ఐహిక ఆముష్మిక సంపదలని విజ్ఞులు గ్రహించవలసి యుండును.

లోకోపకారమను ధర్మము ఒకటి కర్మ భాగములో అగ్రస్థానమును ఆక్రమించు చున్నది. ఈ కాలములో ఈ లోకోపకారము చేయబూనినవాడును లోకములో ఒక జీవుడై వుండుట వలన లోకమునకు జరుగు ఉపకార ములో తానునూ ఒక భాగస్థుడే అని తెలిసికొన గలిగిన యెడల అది లోకోపకారమునకు ప్రథ మోపకారము. నేడు మానవ సేవయే మాధవ సేవ, లోక సేవయే లోకేశుని సేవ, జనసేవయే జనార్దనసేవ, జీవుని సేవయే దేవుని సేవ అని వాడబడుచున్నది. ఈ సూత్రము పరమసత్యం. కానీ దీనిని ఎట్లు చేయవలెనన్న విధానము ఎవ్వరునూ అంతగా గమనించుటలేదు. లోకోప కార దృష్టి అంకురింపవలెనే కానీ అది కలి గిన పిమ్మట దానినెట్లు ఎచ్చట మొదలు పెట్ట వలె నన్న ప్రశ్నయేలేదు. ఎవరికి తోచిన విధానాన్ని వారు అవలంబించుట కానవచ్చు చున్నది. నిజముగా విచారించిన స్వలాభా పేక్షను లోకోపకారమను ముసుగుతో కప్పు చున్నారు. లోకోపకారార్థమై ప్రజల నైతిక బుద్ధి బలపరచు ప్రేయశ్శ్రేయోమార్గములకన్నా దాని విధ్వంసక విధానము అవతరించుచున్నవి. సహాయపడుట, మరొకరితో సహకరించుట, ఇతరుల కష్టనష్టములందు సానుభూతి చూపుట, కేవలము స్వార్థము నకే తావునీయకుండా, మనము దేనినొనరించిననూ, అది లోకోపకారక క్రియగనే పరిగణింపబడును. ఇది నేడు క్రొత్తగా ఏర్పరచిన విధానముకాదు. అనాది కాలమునుండీ సృష్టి ఆదినుండీ మన పూర్వీకుల నుండీ ఆచరణలో వచ్చుచున్నది. అయితే మన పూర్వీకులు ధర్మము నాచరించుటయే స్వకీయ, పరకీయ లోకోపకార సూత్రమని గ్రహించి యుండిరి. ఏనుగు పాదము జాడయందు తదితర జంతుపాదముల జాడ యిమిడి యుండ గలిగినట్లు ధర్మపాదమున సర్వోపకారములు ఇమిడి యుండునని మన పూర్వుల విశ్వాసము. ఉన్నత ఆశయాలు, ధర్మ చింతనలు మన పూర్వీకులకు ఉగ్గుపాలతో చేర్చినవి. అందువలన వారి ధర్మాచరణ మిక్కిలి ప్రశస్త ముగా, ప్రశంసనీయముగా నుండెడిది. పూర్వము వసతిగృహ, కూప, తటాక, దేవా లయాది నిర్మాణములు, మృష్టాన్నదానము మున్నగునవి లోకోపకారకమని తలంచెడివారు. విద్యలను, కళలను పోషించుట లోకోపకారక మని తలంచి, అట్టివానిని పోషించి సంరక్షించు మహనీయులను చేరదీసి, అగ్రహారములు గ్రామాలు, భూవసతులు మున్నగు దానధర్మము లకు గడంగిన లోకోపకార ధర్మనిరతుల యశశ్చంద్రికలు నేటికినీ నిదర్శన సూచక ములై గ్రహ తారలవలె కట్టుకదలక, చెక్కు చెదరక నిలచియున్నవి.

# నహి జ్ఞానేన సదృశం

పూర్ణ ప్రేమయందె పుట్టును సౌఖ్యంబు
త్యాగ సత్య శాంతి దాంతులకును
ప్రేమ తెలియకున్న క్షేమంబు లేదొకో
వినుడు భారతీయ వీరసుతులు.

స్వార్థం కేవలం పశుగుణం. విశాలమైన మానవత్వం లోపల దివ్యత్వం అనంతంగా ఉంది. స్వార్థం ఒక మరణం వంటిది. ఈ స్వార్థరహిత ప్రేమయే ఈశ్వర ప్రేమ. విశాలమైన ప్రేమ భావాన్ని దాని తత్త్వాన్ని తెలిసికొన్నప్పుడే జ్ఞాన సిద్ధి లభిస్తుంది.

సంకుచిత భావాలను దూరంగా నెట్టి ప్రేమతత్త్వంలోకి ప్రవేశించాలి. ప్రారంభంలో కొంత స్వార్థం అవసరమే. కానీ ఎంతకాలమైనా స్వార్థంతోనే బ్రతుకుతూ జీవితాన్ని వ్యర్థం చేయరాదు. అది మానవునికి సార్థకత కాదు. బైబిలులో ఒక సూక్తి వుంది. చర్చిలో పుట్టడం మంచిదేకాని చర్చిలో చావడం మంచిది కాదు. అలాగే స్వార్థం ప్రారంభంలో అవసరమే కానీ అందులోనే జీవితాన్ని అంకితం చేసికోరాదు.

## పుట్టగానే కంఠంలో కర్మమాల

ఏ వ్యక్తి కాని తల్లిగర్భం నుండి పుట్టినప్పుడు అతని మెడలో రత్నాలహారాలు వుండవు. ముత్యాలహారాలు వుండవు. వజ్రాలదండలు వుండవు. పచ్చంహారంకూడా వుండదు. కానీ ఒక్క మాల వుంటుంది. జన్మజన్మాంతకర్మలు ప్రోగుచేసినమంచినీ చెడును తుంచకుండా బ్రహ్మ మనకు ఒక 'బరువు మాలను' ఇచ్చి పంపును. అదియే కర్మలన్నియు చేర్చిన కంఠమాల. కనుక వెంట, జంట, ఇంట కంట వుంటుంది. దివ్యత్వం విస్మరించి, దాన్ని అజ్ఞానంతో ఈ కంఠమాలచేత మన కంఠాన్నే త్రుంచుకుంటున్నాం.

జలమందు పంచదార గుణం, ఇంకా పెక్కు గుణాలువున్నా, శక్తులువున్నా ఈ గుణాలు అలలయందు, నురుగునందు సంక్రమిస్తాయి. అదే విధంగా సచ్చిదానంద స్వరూపం తొలుత ఆధ్యాత్మికమునందు తదుపరి వ్యావహారికమునందు, ప్రాతిభాసికమునందు ప్రతిఫలిస్తూ వుంటుంది.

నురుగు అలలను ఆకర్షించినట్లు,అలలు జలాన్ని అనుసరించినట్లు ఒకే ఒక్క దివ్యత్వం ప్రాతిభాసిక, వ్యావహారిక, ఆధ్యాత్మిక జీవితాలను అనుసరిస్తుంటుంది. ఇక్కడ కూటస్థుడు అన్నపదం వుంది. దీనికి 'ఎప్పటికీ మారని వాడు' అని అర్థం. ఎప్పటికీ చలించనివాడు, కదలనివాడు అనికూడా అర్థం. కదలనివాడుచలించనివాడు ఎవరు? ఇదియేఈశ్వర తత్త్వం.

## జ్ఞానమే ఉన్నతమైనది

'న హి జ్ఞా నే న సదృశం' జ్ఞానాన్ని మించినది లేదు. అర్జునా! జ్ఞానతత్త్వాన్ని ఆధ్యాత్మికతత్త్వం నుండి అందుకొనేందుకు వీలవుతుంది. ఈ జ్ఞానం జీవునిలో దివ్యత్వం కలిగించేందుకు యత్నిస్తుంది. ఇట్టి పవిత్రమైన ఏకత్వం ప్రకాశిస్తున్న ఆధ్యాత్మిక తత్త్వాన్ని గుర్తించాలని అర్జునునకు ప్రబోధించాడు కృష్ణుడు. ఎన్ని శక్తులు సాధించినా, ఎన్ని విద్యలు నేర్చినా ఆధ్యాత్మిక జ్ఞానం లేకున్న జీవితం శూన్యంగా

రూపొందుతుంది. ఎన్ని చదువులు చదివినా ఏమి ఫలం? తన నొసట వ్రాత తప్పింప ఎవరి తరం? చెడ్డబుద్ధులు చేరినప్పుడు బుద్ధి బండబారును. బెండ బారును.

చదువులన్నీ చదివి ఎందుకు చావాలి? అమృత తత్త్వం కల చదువు అభ్యసించడం మంచిది అని వేమన సులభమార్గంలో చక్కటి సూక్తులు వల్లించాడు. ఇవన్నీ పొట్టకూటి చదువులు. ఆత్మసౌందర్య అన్వేషణ నిమిత్తం ఉపయోగపడే చదువు చదవాలి.

## నారదునిలో అశాంతి

ఒకానొకసమయంలోనారదునిలో తీవ్రమైనఅశాంతి బయలుదేరింది. అన్నివిద్యలూతెలిసినవాడు నారదుడు. ఇన్ని విద్యలు నేర్చినా నారదునిలో ఈ అశాంతికి కారణం ఏమిటి? సర్వసౌఖ్యములున్నా మానసిక శాంతి లేకపోవడం ఎందుకు ?

అప్పుడు నారదుడు సనత్కుమారుని వద్దకు వెళ్ళి ఈ అశాంతిని నిర్మూలనంచేసే దివ్య శక్తి ఏమిటి? ఉపదేశించుమని అడిగాడు. అప్పుడు సనత్కుమార మునీంద్రుడు చిరునవ్వుతో, నారదా! భౌతికమైన ఎన్ని చదువులు తెలిసికొన్నా, ఆత్మతత్త్వాన్ని అర్థంచేసుకోని చదువులు వ్యర్థం అన్నాడు అశాంతిని నిర్మూలం చేసికొనే నిమిత్తం ఛాందోగ్యోపనిషత్‌లో వున్న 'భూమా' అనే విద్యను చెబుతానన్నాడు.

అర్జునా! సర్వభూతములలోవున్న ఆత్మతత్త్వాన్ని సర్వత్రా వ్యాపించిన అఖండతత్త్వాన్ని అర్థంచేసికో. అందుకే పవిత్రమైన ఉత్తమమైన ఆధ్యాత్మిక జ్ఞానాన్ని నీకు ప్రబోధిస్తున్నాను. ఇదిగో గొప్పతారకమంత్రం ఉపదేశిస్తున్నాను.

## తారక మంత్రం

అండపిండ బ్రహ్మాండంలో నిండిన జ్యోతిని సత్యముగా భావించి విశ్వసించాలి. సద్గురు కృపచేత ఆ తారక మంత్రాన్ని తెలిసికోవాలి. ఆధ్యాత్మిక తత్త్వాన్ని అర్థం చేసికోవాలి. మానవునిలో గల దివ్యత్వాన్ని అవగాహన చేసికోవాలి.

మనకు కనిపించే నక్షత్రాలు ఎన్నో ఉన్నాయి. కనిపించని గ్రహాలు ఎన్నోఉన్నాయి. వీనిని తెలిసికొనేందుకు మానవుడు కొంతవరకు ప్రయత్నిస్తున్నాడు కానీ సర్వమూ తెలిసిన మానవులు ఎవరున్నారు ?

అన్నీ తెలిసిన వాడు ఆధ్యాత్మిక స్వరూపుడైన ఆ భగవంతుడే. తెలియని తత్త్వాన్ని తెలిసికొనే యత్నంలో ఆత్మతత్త్వాన్ని గుర్తించు. ఇదియే భారతీయ సంస్కృతికి మూలాధారం. సంస్కృతి తత్త్వమనగా కర్మచేత, ప్రారబ్ధంచేత దూరమైన తత్త్వాన్ని బ్రహ్మచేత తిరిగి నింపాలి. దీనినే మనం 'రిలిజియన్' అంటాం.

## రిలిజియన్ అంటే...

ఆర్.ఇ. (రి) అంటే తిరిగి, మరల అని అర్థం. లిజియో అంటే 'కలుపుట'అని అర్థం. ఈ రెండింటిని కలిపితే రిలిజియన్. 'తిరిగి కలుపుట' అని అర్థం. దేనిని మనం కలపాలి ?

ఇంతకుముందే ఉండిదూరమైనదానిని మనంకలపాలి. జీవుడు దైవముతో కూడిన వాడై కొన్ని కారణాల చేత విడిపోయినాడు. విడిపోయిన జీవుని తిరిగి బ్రహ్మతో కలపడమే దీని అర్థం. ఇది చేరుటకు, చేర్చుటకు, కలియుటకు ఎంతో శ్రమపడాలి.

సముద్రమునుండి సూర్యకిరణాలచే జలం ఆవిరిగా మారి పైకిపోతుంది. తర్వాత మేఘాలుగా రూపొంది, ఏ కొండలపైనో వర్షం కురుస్తుంది. అద్భుతమైన, అనంతమైన, విడిపోయిన ఈ జలం క్రిందపడి పల్లమునకు ప్రవహించి అవస్థలకు గురియై స్వస్థలం చేరుకొంటుంది. అలాగే మనం ఈశ్వరునినుండి విడి

బ్రహ్మనుండి వీడి ప్రాకృత బాధలను అనుభవించి, మహనీయుల బోధలతో అనుగ్రహం పొంది తిరిగి బ్రహ్మలో లీనం అయ్యేందుకు ప్రయత్నించాలి.

ఈ సత్యాన్ని గుర్తించక జీవిత పర్యంతం గ్రుడ్డి వారమై ఇహలోక సుఖాలతో జీవితాన్ని వ్యర్థం చేస్తున్నాము. జగత్తులో ఎంతకాలం బ్రతికినా, ఎంత భుజించినా జానెడు పొట్ట నింపుకోలేకపోతున్నాం. దురాశలకు గురియై దురాలోచనలతో దిగజారిపోతున్నాం.

అర్జునా! నరజన్మ ఉత్తమమైనది. ఇది కేవలం పొట్టకూటికై ప్రాకులాడేందుకు కాదు పశుపక్ష్యాదుల వలె మనం కూడా పొట్టను నింపుకొనేందుకు ఈ జన్మ ప్రాప్తించలేదు. మానవత్వ రహస్యం తెలిసికోనేందుకు ప్రయత్నించు.

పశుపక్ష్యాదులు ఒక హద్దును నిర్మించుకున్నాయి. కాని మానవునకు ఎట్టి నియమములు లేక మృగముల కంటే దిగజారుతున్నాడు. అర్జునా! మానవత్వపు దివ్యత్వాన్ని తెలిసికొనేందుకు పవిత్ర జ్ఞానాన్ని తెలుసుకోవాలి. అప్పుడే జ్ఞానపరిపూర్ణత లభిస్తుంది.

ఎన్ని వర్ణాలు ఏర్పడినా అవి గుణ సంబంధమునకు చెందినవే కాని ఈశ్వర ధర్మానికి చెందినవి కావు. గుణ ధర్మాలు త్యజించి ఈశ్వరధర్మం అనుసరించి నప్పుడే ఆత్మతత్త్వాన్ని తెలుసుకుంటావు.

మనం బ్రతుకుతున్నది బ్రహ్మకొరకు గాని అన్నం కొరకుగాదు. ఆహారం దేహ సంరక్షణ కొరకే గాని ఆత్మ సంరక్షణకు కాదు. తినడానికి బ్రతుకరాదు. బ్రతకడానికి తినాలి. మనం నీతిని నిజాయితీని నిలబెట్టుకోవాలి. ధనం వస్తుంది. పోతుంది (గోస్). కానీ నిజాయితి వస్తుంది. అభివృద్ధి (గ్రోస్) చెందుతుంది.

ప్రియమైన విద్యార్థులారా! నీతి నిజాయితీ రెండు నేత్రాలవంటివి. ఈ గుణాలు కేవలం ఆధ్యాత్మికత లోనే వున్నాయి. ఈ రెండు గుణాలు కోల్పోవుటచేత ప్రపంచంలో అవస్థలకు గురిఅవుతున్నారు.

మీరు భగవద్గీత సందేశాలను వాక్యాలను అర్థం చేసికొని, భావిభారత పౌరులుగా రూపొందాలి. నీతి నిజాయితీ పెంచుకుని, భారతదేశంలో శాంతి సందేశాలను ప్రబోధించాలి.

శ్రీవారి దివ్యోపన్యాసము
వేసవి తరగతులలో
28-6-79

## ఆపద్బాంధవుడు

ఆనాటి ఘటన, ఆనాటి ప్రమాదము నీ సంకల్ప బలమో, నా పూర్వజన్మ ఫలమో ప్రమోద భరితమై చెరగని ముద్ర వేసె హృదయ ఫలకముపై మగతలోన మసలితి నీ సన్నిధి చెంత. కదలెను నీ దివ్యరూపము మూసిన కన్నులలోన. మదిలోని చీకటి వీడి కాంతిపుంజము సోకె. ఏదో వింత శక్తి, క్రొత్త శక్తి చేరి నట్లాయె. అణువణువున నిండిన దివ్యానుభూతి నే నెటుల మరువగలను. పునర్జన్మ నొసగి ఆపద కాచిన ఆపద్బాంధవా అర్పించితి హృదయ కుసుమమును నీ పాద పద్మముల చెంత.

శ్రీమతి కె. భార్గవి (అనంతపురం)

# ధ్యానం; ధ్యేయం

లోని శత్రువులకు లొంగిపోయినవాడు
బయటి రిపుల నెట్లు పట్టగలడు ?
తత్త్వ మెరిగినంత ధన్యుడౌ నరు డిల
ఉన్నమాట తెలుపుచున్నమాట.

సంకల్పించడమే మనస్సు స్వభావం. అది నిరంతరం సంకల్పవికల్పాలతో చింతిస్తుంది. ఒక్కొక్కసారి అది వక్రమార్గం పడుతుంది. సంకల్పవేగం చేత మనిషిని మనస్సు తబ్బిబ్బు చేస్తుంది. ఈ దశ నుంచి మానవుడు తప్పించుకొనుట అత్యవసరం.

అర్జునా ! మనస్సు వేగం గాలికంటె ఎక్కువ. ఆత్మానందాన్ని పొందగోరువానికి మనో నిగ్రహం ముఖ్యం. వేగంగా పరుగెత్తే కారును నిలపటానికి బ్రేకులు అవసరం. అదే విధంగా తీవ్రంగా పరుగెత్తే మనస్సు వేగాన్ని అరికట్టాలి

మనస్సు దృఢమైనది, బలమైనది. ఉద్వేగంతో కూడిన మనస్సు ద్వారా మానవుడు దివ్యత్వం పొందలేడు.

## మనస్సు తుమ్మెదవంటిది

మనస్సు ఒక నల్లటి తుమ్మెదవంటిది. ఆకారంలో తుమ్మెద చిన్నదే. కాని ఎంత పెద్ద కొయ్యలోనైనా సులభంగా రంధ్రం చేసుకొని ప్రవేశించగలదు. అంతే గాక మానవుని దేహంలో కూడా రంధ్రం చేసుకొని ప్రవేశించడానికి ప్రయత్నిస్తుంది. పరశురాముని విషయంలో ఇదే జరిగింది. ఇట్టి బలవత్తర శక్తిగల తుమ్మెద కమలంలో ప్రవేశిస్తే మకరందాన్ని గ్రోలుతూ కమలం ముడుచుకున్నప్పుడు వెలుపలికి రాలేకపోతుంది. అదే విధంగా బలవత్తరమైన మనస్సు పరిపరివిధాల పోవడం ద్వారా విజయం సాధించలేకపోతున్నాము. ఈ మనస్సు భగవంతుని పాద పద్మములయందు ముఖపద్మమందు ప్రవేశింపజేయాలి. ఇందుకు ఉత్తమమైన శిక్షణ అవసరం.

## మనో నిగ్రహం ఎలా సాధ్యం ?

సంకల్పాలకు ఆలవాలమైన మనస్సును నిగ్రహపరచడమెలా ? కృష్ణుడు అర్జునునకు చేసిన దివ్య బోధ ఇదే. మనో నిగ్రహనికి ధ్యానం అత్యవసరం.

భగవద్గీత ఆరవ అధ్యాయాన్ని ఆత్మ సంయమన యోగం అన్నారు. కాని ఇది పొరపాటు. నిరంతరమైన, నిత్యమైన, సత్యమైన ఆత్మకు సంయమనం లేదు. మనస్సుకు సంయమనం అవసరం కాని ఆత్మకు కాదు. సంయమన మనగా అరికట్టడం, అదుపులోకి తేవడం. ధ్యానం ద్వారానే ఇది సాధ్యం. ధ్యానంలో అనేక అవాంతరాలు కలుగవచ్చు. వాటిని అరికట్టాలి. సంకల్ప వికల్పాలను అదుపులో పెట్టుకోవాలి.

## శౌచే దేశే

శౌచే దేశే, అంటే ధ్యానం చేసే దేశాన్ని (నీ చుట్టూ ఉన్న పరిసరాలను) పరిశుభ్రం చేసుకోమన్నాడు. పరిశుభ్రం చేసుకోవ సింది నీ ముఖం కాదు. తపస్సు కాదు.

మొదట ధ్యానం చేసే ప్రదేశం పరిశుభ్రంగా ఉండాలి. ధ్యానానికి గృహమో, అడవో ఆత్యవసరం కాదు. చిత్తం దేహం భౌతిక సాధనకు తోడ్పడుతాయి. హృదయ తత్త్వమే పవిత్రం.

సామాన్య మానవుడు ఒకచోట కూర్చునే ముందే ఆ ప్రదేశాన్ని పరిశుభ్రం చేసుకుంటాడు. అనిత్యమైన, అశాశ్వతమైన దేహానికే ఇంత పరిశుభ్రత అవసరమైతే దేహంలో గల దైవత్వాన్ని గుర్తించడానికి ఎంత పరిశుభ్రత అవసరమో గుర్తించాలి.

కారణమేమనగా: అనాది కాలంనుండీ మానవునిలో తమో, రజోగుణాలు గూడు కట్టుకొని ఉన్నాయి. ఈ విధంగా అది అపవిత్రమైంది. దానికి పవిత్రత అవసరం.

## మనస్సు - స్థితి

మనస్సునకు మూడు విధాలైన స్థితులు ఉన్నాయి. 1. శూన్యత, 2. అనేకత్వం, 3. ఏకత్వం.

అనేకత్వానికి ముందు మనిషి శూన్యత్వంలో ప్రవేశిస్తాడు. ఈ స్థితిలో అతనిలో తమోగుణం తాండవమాడుతుంది. కేవలం నిద్రించడం, ఆలోచనలో మునగటం ఇది తమోగుణ లక్షణం.

అనేకత్వం స్థితిలో మనిషికో రజోగుణం ఉంటుంది. అప్పుడు మనిషి ఒక విషయాన్ని వింటున్నట్లు నటిస్తాడు. కాని మనస్సు పరి పరి విధాలపోతుంది. 'చిత్తం చెప్పులపైన, భక్తి శివునిపైన' అన్నట్లుంటుంది. రజోగుణంతో కూడిన ఈ అనేకత్వానికి తావు ఇవ్వరాదు. లోకంలో తమో, రజో గుణాలతో కూడిన వారే అధికంగా ఉన్నారు. సత్త్వగుణ సంపన్నులు బహు అరుదు.

ఏకాగ్రతకు ధ్యానం ఆత్యవసరమని కృష్ణుడు అర్జునునికి బోధించాడు.

ధ్యానం ఒక సాధనం. ధ్యానంచేసే వ్యక్తి ధ్యేయం చేయవలసిన లక్ష్యం. ధ్యేయ, ధ్యాసల ఏకత్వానికి మనం ప్రయత్నించాలి. ధ్యాన ధ్యేయ ధ్యాసల సంపుటితో దీనికి ధ్యానమనే పేరు సార్థకమైనది.

ధ్యానం చేసేటప్పుడు చేసేతత్త్వాన్ని మరచిపోవాలి. దీనిని చేస్తున్నాము అనే విషయాన్ని కూడా మర్చిపోవాలి. ధ్యేయాన్ని మాత్రం దృష్టిలో ఉంచుకోవాలి. దీనిని త్రిపుటి అంటాం. దేహం, భావం, దేవునియందు లీనం కావడమే ధ్యానం. అంతేకాని ధ్యానం చేస్తున్నాము అనే దేహ భ్రాంతి వల్ల అది సిద్ధించదు.

## ఏకాగ్రత ధ్యానం కాదు

ధ్యానం అనగా ఏకాగ్రత అని అంటారు. కాని ఈ ఏకాగ్రత ధ్యానం కాదు. ఏకాగ్రత లేకపోతే నిత్య జీవితంలో దేనిని సాధించలేము, ఒక పుస్తకం చదవాలన్నా, ఒక ఉత్తరము వ్రాయాలన్నా, ఒక కారు నడుపాలన్నా ఏకాగ్రత అవసరం.

ఉదాహరణకు మనం ఒక పుస్తకాన్ని చదువుతున్నప్పుడు చేయి దానిని పట్టుకుని ఉంటుంది. కంటిచూపు ద్వారా అక్షరాలను చదువుతుంటాం. బుద్ధి విచారిస్తుంటుంది ఏకాగ్రత ఉన్నప్పుడే విషయ గ్రహణం సాధ్యమౌతుంది. చెయ్యి, మనస్సు, బుద్ధి ఇంద్రియాలు. ఇంద్రియాలకు లోబడేది ధ్యానంకాదు. ఇంద్రియాలకు అతీతమైనది ధ్యానం క్రమ క్రమేణా మనస్సును అదుపులో పెట్టి ధ్యానాన్ని ఆచరించాలి.

ధ్యానమనే ఈ పవిత్ర సాధనంకోసం ప్రాచీన కాలంలో ఋషులు అన్నపానాదులను వదిలి పెట్టారు. ఎంతో శ్రమ పడ్డారు.

# కృత్రిమ ధ్యానం

ఈనాడు పెక్కుమంది చేసే ధ్యానం కృత్రిమమైనదిగా కనిపిస్తున్నది. ఇది తలనొప్పికి వేసుకునే మాత్ర వంటిది. ఇది భారతీయ సంస్కృతికే అవమానం. ఇంద్రియ నిగ్రహంచేత, నిస్వార్థ చింతన చేత హృదయపీఠంలో దైవత్వాన్ని గుర్తించవచ్చు. అనిత్యమైన, అశాశ్వతమైన దేహం మనలక్ష్యం కారాదు. కేవలం భక్తి ప్రపత్తుల చేత, ప్రేమ స్వభావంచేత ఈశ్వరత్వాన్ని గుర్తించవచ్చు.

దేహం నశించే స్వభావం కలది. ఏకాగ్రత కూడా నశిస్తుంది. వ్యక్తి ఒక జ్యోతిని లక్ష్యంగా పెట్టుకుని ధ్యానం చేయాలి. ఇది పరంజ్యోతి. ఇది జీవతత్త్వంలోని ఈశ్వరతత్త్వమే. అంధకారంలో పెరిగే ఆత్మతత్త్వం. అశాంతిలోని ప్రశాంతికి, ప్రశాంతి నుండి ప్రకాశానికి, ప్రకాశం నుండి పరమాత్మతత్త్వానికి ఈ పరంజ్యోతి నడిపిస్తుంది. పరంజ్యోతి క్షీణం కానిది.

ఒక పాత్రలో నీరు వుంది. ఒక్కొక్కరు కొంత నీరు తీసుకుంటూ ఉంటే దాని పరిమాణం తగ్గుతూ వస్తుంది. ఒక తట్టలో ఇసుక ఉంది. దానిలో నుంచి ఒక్కొక్కరు కొంత తీసుకుంటూపోతే అదీ తగ్గిపోతుంది. కాని జ్యోతి విషయంలో అలా కాదు. ఒక జ్యోతి నుంచి లక్ష జ్యోతులు వెలిగించినా దాని కాంతి తగ్గదు. కనుక జ్యోతి క్షీణించేది కాదు.

కనుక విద్యార్థులు సులభ మార్గంద్వారా కాత శ్రమతో ధ్యానం చేయాలి. ఈ జ్యోతిని తమలో నిలుపుకోవడానికి ప్రయత్నించాలి.

ధ్యానం చేసేటప్పుడు ఒక జ్యోతిని వెలిగించాలి. దానిని కన్నులతో శ్రద్ధగా చూడాలి. తర్వాత కన్నులు మూసి దానిని హృదయంలో ప్రవేశింపజేయాలి. ఈ జ్యోతి ఆ విధంగా హృదయంలో చేరుతుంది.

'తమసో మా జ్యోతిర్గమయ'— చీకటిలో నుంచి వెలుగులోనికి ప్రవేశించాలి. మన హృదయం జ్యోతికి స్థానమైనప్పుడు దుర్గుణాలు, దుష్ట భావాలు మనలో ప్రవేశించవు. హృదయంలో ప్రతిష్ఠించుకున్న జ్యోతి సర్వాంగాలకు వ్యాపిస్తుంది. అది కంటిలో చేరితే దృష్టి దోషం కలుగదు. చెవిలో చేరితే శ్రవణ దోషం కలుగదు. నాలుకలో చేరితే వాగ్దోషం కలుగదు.

సర్వాంగములందు జ్యోతిని ప్రకాశింపజేసిన తర్వాత మిత్రులందు, బంధువులందు, అందరియందు అది ఉన్నట్లు భావించాలి.

సర్వాంగములందు ప్రతిష్ఠించుకున్న జ్యోతిని ఊహా చిత్రంగా భావించవచ్చు. ఆ తర్వాత అది భావ చిత్రంగా మారుతుంది. కనుక కృష్ణుడు, ధ్యానం ద్వారా స్వేచ్ఛను పొందవచ్చునని అన్నాడు. ధ్యానం ఈశ్వరునియందే లగ్నం చేయాలి.

సత్యమైన, నిత్యమైన జ్యోతిని ఇష్ట దైవంలో ప్రతిష్ఠించుకోవాలి. ఏకమైన దివ్యత్వాన్ని అప్పుడు బహురూపాల్లో దర్శించవచ్చు. ఒక జ్యోతిని అనేక రూపాల్లో దర్శించడానికి ప్రయత్నించాలి. ఈ సర్వదేవతా స్వరూపం నీ రూపంలో ఏర్పడాలి. విశ్వరూపాన్ని చిత్రించుకోవాలి.

దేవుడు ప్రత్యేక ప్రదేశంలో లేడు. అనేకులు అజ్ఞానం చేత దేవుని గురించి వాదోపవాదాలు చేస్తారు. ప్రతి వ్యక్తి దేవుడే. అందరూ దివ్యమైన ఆత్మ స్వరూపులే. నీవు దేహ భ్రాంతిచేత మానవుడుగా భావిస్తున్నావు. ఈ ఆత్మతత్త్వాన్ని తెలియజెప్పడానికి భగవంతుడు అవతారాలు ఎత్తాడు.

ప్రతి వ్యక్తి దైవత్వాన్ని క్షణ క్షణం ఆవిర్భవింప చేసుకుంటే దుర్గుణాలు అతనిలో ప్రవేశించవు. ఈ దివ్య ప్రబోధాన్ని, సర్వేశ్వరుని నిరూపించునది ధ్యానం అని అర్జునునకు కృష్ణుడు బోధించాడు.

మొదట నీలోని దివ్యత్వాన్ని గుర్తించు. ఆ తర్వాత సమాజాన్ని పవిత్రం చేయి. సర్వత్రా ఈశ్వరత్వాన్ని గుర్తించు. అప్పుడే భేదభావాలకు అవకాశం ఉండదు.

ధ్యానం చేసే ప్రదేశం చాలా ప్రధానమైనది. ఏకాంతములో లేక పవిత్ర మందిరంలో ధ్యానం చేయాలి.

ఈనాడు చాలా మంది ధ్యానంచేసేటప్పుడు కట్టు కదలక కూర్చుంటారు. దోమ, చీమ కుడితే ఈ ధ్యానముద్ర వదలిపెడతారు. నిజమైన ధ్యానంలో ఇవేవీ కనిపించవు. ధ్యానం రెండవవానికి తెలియ రాదు. ఒక దేహం మరొక దేహానికి తగలరాదు.

## దేహంలో కరెంటు

దేహంలో సర్వత్రా దివ్యమైనశక్తి (కరెంటు) ప్రవహిస్తుంది. సృష్టి, స్థితి లయలకు ఇదే మూలాధారం. త్రిమూర్తులకు ప్రతిపాదితమైన ఈ మూడు శక్తులు ఏకమైనదేనని, ప్రాచీన శాస్త్రాలు చెప్పుతున్నాయి.

విద్యుత్తు మూడురూపాల్లో ఉంది. అది బల్బులో చేరితే చీకటి మాయమవుతుంది. పంకాలో చేరితే వేడిని దూరం చేస్తుంది. ఇది రక్షణ. ఒక యంత్రములో విద్యుత్తు చేరితే మరొక వస్తువు తయారవుతుంది. ఇది సృష్టి. విద్యుత్తును ముట్టుకుంటే అది మనల్ని శిక్షిస్తుంది. ఇది లయం ఈవిధంగా ఇది మూడు రూపాల్లో ఉంది. వ్యక్తిలోని శక్తి (కరెంటు) కూడా అంతే.

ఒక్కొక్క వ్యక్తిలోని శక్తి (కరెంటు) రక్షిస్తూ శిక్షిస్తూ మూడు స్థానాల్లో మూడు కర్మలుగా ఆచరిస్తుంది. సత్వ, రజస్తమో గుణాల ఏకత్వాన్ని సాధించడానికి ధ్యానం అవసరం.

ఈ ధ్యానం అత్యంత నిష్ఠతో చేయాలి. ధ్యానం ద్వారా దైవత్వాన్ని గుర్తించాలి.

శ్రీ వారి దివ్యోపన్యాసము
వేసవి తరగతులలో
3-6-79.



# దివ్యవాణి

ప్రపంచంలోని పెక్కు ఇతర దేశాలలో నివసించే ప్రజలవలె కాక, అమెరికాలో దాదాపు మేమందరం వారానికి ఐదు రోజులు మాత్రమే ఉద్యోగాలకు వెళ్లుతుంటాం. శని, ఆదివారాలు రెండు రోజులు మాకు వారాంతపు సెలవు దినాలుగా వుంటాయి. పని రోజులలో మాత్రం వేతనాలకు, సరిపడా శ్రమించవలసి వుంటుంది. కాబట్టి మాకు వచ్చేవారం జీవన పోరాటాన్ని తిరిగి ప్రారంభించటానికి సన్నాహంగా వారాంతపు సెలవులలో విశ్రాంతి అనివార్యం అవుతుంది.

ఆ రోజు శనివారం. వేకువ జామునే లేచాము. మామూలు దినచర్యగా ధ్యానానికి ఉపక్రమించాం. అదొక మహాద్భుతమైన భావన. ఆత్మ సాన్నిధ్యం నుంచి అనంతమైన ప్రశాంతతను చూరగొని పవిత్రమైన అంతర్ముఖంవైపు ప్రయాణానికి శుభ సమయం అది. ఉదయాత్పూర్వం ధ్యానంవల్ల మనస్సుకి ఎక్కడలేని ప్రశాంతత లభించింది. వేకువఝామున

ధ్యానావకాశాన్ని ఎవరు జారవిడుచుకుంటారో అట్టి వారు ఆలోచనా తరంగాలలో కాలాన్ని వృథా చేయ టమే అవుతుంది. ఆలోచనా తరంగాలను అదుపు చేసుకోలేనప్పుడు మనో వీధులలో ఆ సంకల్పాలు వరదలై పారుతాయి. మనస్సే ఆధిపత్యం వహిస్తుంది. తన ఆదేశాలను జారీచేస్తూ విభిన్న మార్గాలలో పరు గులు తీయ నారంభిస్తుంది. మనస్సుకు, బానిసలయ్యే దుఃస్థితి ఇదే.

ప్రశాంతమైన ఆ ఉషోదయ సమయాన భ్రాంతి జన్యమైన ప్రపంచం వైపు నన్ను తరిమి కొట్టే శక్తి బలహీనమైన సంకల్పాలకు లేదు. వేకువఝామున తలయెత్తే సంకల్పాలు అంత బలవత్తరమైనవిగా వుండవు. మనలను సంసారంలో బంధించగల బల మైన శక్తి ఆ సమయంలో వానికి అంతగా ఉండదు. ఈ భావనా పరంపరల వల్ల నాలో కలిగిన ఒక ఆనందానుభూతి అనిర్వచనీయమైనది. తెరచివున్న కిటికీల గుండా నీలి కాంతులను నింపుకొని వున్న పాసిఫిక్ మహాసముద్ర జలాలవైపు చూచాను. సమీప ఉద్యానవనం నుంచి మల్లెపూల సువాసనలు ఏదో వర ప్రసాదంగా నన్ను మైమరపిస్తున్నాయి. అక్కడి పొద రిండ్ల నుండి మధురమైన పక్షుల కిలకిలారావములు నూతన దినానికి స్వాగతం పలుకుతున్నట్లుగా విని పిస్తున్నాయి.

పవిత్రమైన, ప్రశాంతమైన, అత్యంత ఆహ్లాదకర మైన ఆ ఉషోదయ విన్యాసాల మధ్య నా స్వామి పలుకులు నా చెవిలో వినవచ్చాయి. శ్రవణేంద్రియ అంతర్ ద్వారం నుండి వినిపించిన మధురాతి మధుర మైన స్వామి పలుకులు నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. "ఆత్మశక్తిని పెంచుకో. నీ అంతరంగపు పెట్టుబడి అదే" అన్న స్వామి దివ్యవాణి నన్నెంతో పులకింప చేసింది. అదొక మహదాశ్చర్య కరమైన సన్నివేశం. తన భక్తులను అనుక్షణం కంటికి రెప్పలా కనిపెట్టి వుంటానని స్వామి చేసిన వాగ్దానానికి మరొకసారి నిరూపణ జరిగింది. స్వామి సందేశ సారాన్ని మననం చేసుకోవటంలో నా సోదర సోదరీమణులతో కలిసి పాలు పంచుకోవాలనిపించింది. స్వామి దివ్యవాణి ఈ క్రింది విధంగా సాగింది.

"మానవుడు తన అజ్ఞానం కారణంగా అనుక్షణం మనస్సులో ఏదో ఒక సంకల్పానికి చోటిస్తూనే వుంటాడు. మనస్సులో ఏ కొద్దిపాటి ఇచ్ఛ తల యెత్తినా, అది అతనిని కర్మ ప్రవృత్తిలోకి దింపి తీరు తుంది. ఆ కర్మలలో కొన్ని అతని జీవితంలో మిగి లిన భాగాన్ని మ్రింగివేస్తాయి. తన ఆత్మశక్తిని గుర్తించలేక, ఆత్మోన్నతికి ప్రయత్నించక మనో దౌర్బల్యానికి గురి అయిన వ్యక్తి సంకల్పముల ప్రభంజనానికి బంధితుడవుతాడు. అనుక్షణము నీ ఆత్మసాన్నిధ్యంలో గడపటానికే ప్రయత్నించాలి. ప్రతిక్షణం స్వస్థాన (ఆత్మ) నివాసానికే వినియోగ పడాలి. నీ దేహమునే ఒక దేవాలయంగా మార్చి వేయాలి. మధురమైన ఆ భగవద్విభూతితో నీ తనువు నిండి పులకించి పోవాలి అనన్య భక్తి భావం వల్ల ఆత్మశక్తి మేల్కొంటుంది. తరగని శాంతి నీకు లభిస్తుంది. అంతరంగము నుండి లభించే శాంతే జీవిత అద్భుతాలలో మహాద్భుతమైనది. బంధవిముక్తికి అదే నాందీ ప్రస్తావన. అది నీలోనే వుంది. సహజ సిద్ధమై వుంది. నిగ్రహం లేని మనస్సు ఐహిక విషయ వాసనలయందు మునిగి తేలుతుంటుంది."

"ఒక బ్యాంకు ఎకౌంటులో కొంత మొత్తాన్ని పొదుపు చేసినప్పుడు వడ్డీ లభించడం సహజమే కదా? కాలాన్ని భక్తి మార్గంలో పెట్టుబడి పెట్టినవారికి నిర్వి రామంగా 'డివిడెండ్లు' లభిస్తూనే వుంటాయి. ఆత్మ నిష్ఠలో కాలాన్ని డిపాజిట్ చేసిన వారికి అదెంతో లాభదాయకంగా వుంటుంది. ఐహిక లాభాల విషయ ములో వడ్డీ రేట్లు, కాలం, మున్నగు పెక్కు అంశాలు

గణనలోకి వస్తాయి. కాని, భగవంతునిపై విశ్వాసమనే ఎకౌంటులో పడే జమలపై తిరిగి లభించే వడ్డీమొత్తాలు అత్యంత మధురంగా వుంటాయి. జీవితకాలం క్షణం క్షణం తరిగి పోతున్నది. జీవితం వృథా అయిందన్న గుర్తింపు ఏదో ఒక క్షణంలో కలిగినప్పుడు అమూల్యమైన జీవితాన్ని స్వార్థ బుద్ధితో చేజేతులా వృధా చేసుకున్నట్లు అనిపిస్తుంది. అంత్యకాలంలో తాను గడించిన ఐహిక లాభములన్నిటిని వదలి పోవలసి వుంటుంది. ఒక ఆస్తికి చట్టరీత్యా ఆవ్యక్తికి హక్కు వున్నట్లు హామీపత్రాలు వుండవచ్చు. కాని, ప్రాణ ప్రయాణ సమయంలో ఆపత్రాలు ఎందుకూ కొరగావు. వ్రాత పూర్వకంగా వున్న ఆకాగితం సైతం కాలగర్భంలో దుమ్ము కావలసిందే. ఇక పోతే అగ్రిమెంటులు, కాంట్రాక్టులు ఎంత చట్టబద్ధంగా వ్రాసుకున్నప్పటికీ భగవంతుని వద్దనుంచి పిలుపు వచ్చిన క్షణంలో వాటిని సైతం వదలి పెట్టవలసిందే. జీవితకాలాన్ని యావత్తూ ఇట్టి ప్రాపంచికపు పెట్టుబడులపై వినియోగించే మానవులకు తమలో నున్న తరగని నిధి వంటి ఆత్మశక్తి అన్వేషణకు క్షణం తీరిక లేక పోతున్నది.

"రక్తమాంసములతో కూడిన దేవాలయమైన నీదేహంలో దివ్యాత్మ వెలుగొందుతున్నప్పుడే ఆత్మ శక్తిని పెంచుకొనే పెట్టుబడిని పెట్టుమని నేను చెప్తున్నాను. నీలోనే నిహితమైవున్న అంతరంగ భగవద్విభూతిని అన్వేషించు. నీలో అంతర్గతంగా వున్న నిగూఢమైన ఆత్మశక్తిని కనిపెట్టి అనుభవించు. ఒకసారి నీవు ఆ ఆనందాన్ని రుచి చూచినట్లయితే అలౌకిక ఆనందంలో తన్మయుడవు కాగలవు. జీవితంలో ఎన్ని అనుభవించినా అవి అన్నీ ఇట్టి ఆత్మానందం ముందు దిగదుడుపు అని తెలియగలదు. నావైపు సాగించే నడకలో నీవు హెచ్చుకాలం వినియోగించినట్లయితే భ్రాంతి జన్యమైన, అశాశ్వతమైన ఐహిక విషయములందు కాలము గడిపేందుకు నీకు అంత తీరికే వుండదు. పరమాత్మపై మరులు గొన్న వారిని ఐహిక విషయములు బంధించలేవు.

"నీలోనే మేలిమి బంగారపు నిధి వున్నదని నిజముగా నీవు గుర్తించినపుడు తరగని ఆ దైవిక సంపదను నిరంతరము అనుభవించక వుందువా? సత్య ప్రేమ, సంతోషము, ఆనందము వంటి ఎన్నో నిధులు తనివితీరా అనుభవించుటకు భగవంతుడు వాటిని నీకు పూర్తిగా అనుగ్రహించి వున్నాడు. భగవంతుని అపారకృపను అనుభవించుటలో నీదే ఆలస్యము. ఆర్తితో, ప్రేమతో నాదరి చేరుమని నిన్ను మరల మరల పిలుచుచున్నాను. నీజీవితంలో మిగిలిన కొద్దిపాటి కాలాన్ని హరించేందుకు ప్రాపంచిక విషయములు, ఆకర్షణలు వలపన్ని యున్నవి. దృష్టిని నా వైపుకు త్రిప్పుము. విషయజాలము నుంచి తప్పించుకొన గలవు. నీవీభూమిపై పడినప్పుడే అద్భుతమైన దివ్యాత్మ నీ వెంటవున్నది. బూడిదగా మారే ఈ భూతలంపై నీవు పుట్టినప్పుడే ఆశ్చర్యకరమైన ఆత్మజ్యోతి కూడా నీవెంట వున్నది. ఆదివ్య జ్యోతివైపు నిన్ను నడిపించెదను" స్వామి దివ్యవాణి వినిపించిన పలుకులివి.

ఇది వ్రాయటం పూర్తి అయిందోలేదో, ఇంతలో ఒక అందమైన పక్షి నా చెవిచుట్టూ విచిత్ర ధ్వనితో విన్యాసం చేసింది. బాబా నాకేదో సందేశ మిస్తున్నట్లుగా అనిపించింది. ఆ సందేశం నాహృదయాంతరాన్ని తాకినట్లయింది. అంతలోనే దూతగా వచ్చిన, అందమైన రెక్కలు గల ఆపక్షి అనంత ఆకాశంలో అదృశ్యమైంది. దివ్యాత్మ అనే మహాసాగరంలో లోతుకు నేను మునిగిపోయినట్లు విచిత్రమైన ఒక దివ్యానుభూతిని పొందాను.

చార్లెస్ పెన్
కాలిఫోర్నియా, (యు. ఎస్. ఏ)

# భవసాగర తరణోపాయం

నగరాలు తుపానుకు గురిఅయిన సముద్రాలవలె, ఉవ్వెత్తునపడి లేచే కల్లోలితతరంగాలతో అశాంతికి ఆలవాలమైనాయి. గాఢాంధకారమయమైన సముద్రపు కెరటాలమధ్య క్రిందుమీదులయ్యే పడవలమాదిరి నగర వాసులు దరిగానక కొట్టుమిట్టాడుతున్నారు. వారి వారి హృదయాలను సాగరతరంగాల ఘోషవంటి నైరాశ్యం ఆవరించింది. నగర జీవితాల నాగరకతా ప్రభావం పల్లెపట్టులను సైతం ఊపిరితీసుకోనివ్వడం లేదు. అశాంతి నలువైపులా అలుముకొంటున్నది. ప్రతి ఒక్కరు వ్యాకులపాటుతో జీవించేస్థితి నేడు కానవస్తున్నది. ఇట్టి దుర్భర పరిస్థితులలో దిక్కు తోచని మానవులను ఆదుకొని సురక్షిత ప్రశాంత తీరాలకు చేర్చగల కాంతికిరణం ఆధ్యాత్మిక మార్గం ఒక్కటే. అదేవారి జీవితాలకు ఆశాజ్యోతి. ప్రశాంత జీవితానికి ఆధ్యాత్మిక ఆదర్శం తప్ప వేరుమార్గం లేదు. అశాంతితో అతలకుతలమైపోతున్న మానవుని మనస్సు కోరికల పుట్టవంటిది. ఇది అది అననేం. అన్నిరకాల కోరికలు అక్కడ తలఎత్తి బుసకొడు తుంటాయి. ఆ కోరికలు నెరవేరక పోవటంతో అశాంతి విలయతాండవంచేస్తూ మానవుని మరింత నైరాశ్యంలోకి త్రోసివేస్తుంది. అట్టి జీవితం చెప్పనలవి కాని దుర్భర దుఃస్థితిలో దారుణ పరిస్థితులలో చివరి శ్వాస విడుస్తులది. భగవంతుని కోసం ఆరాటం, పరమాత్మ సాయుజ్యం కోసం తపన, ఆత్మ సాక్షాత్కారం పట్ల తీవ్రమైన తీరని ఆకాంక్ష మానవుని హృదయాంతరాలలో సహజమైఉంటుంది. కాని దానిని అతను విస్మరించడంతో అట్టడుగున మరుగు పడిపోతున్నది. ఆత్మ సాక్షాత్కారమనే ఏకైకలక్ష్యం తప్ప తదితరమైనవన్నీ నిస్సారమైనవి, నిష్ప్రయోజనమైనవి. మానవునికి విచక్షణా శక్తి అపర మాత్మ ప్రసాదించి వున్నాడు. ఏది నిజంగా శ్రేయస్కరమైనది? ఏది పైకి మాత్రం సంతోషప్రదంగా గోచరించి హాని కలిగిస్తుంది? అనే వివేకం మానవునికి వున్నది, కాని మానవుడు దానిని సద్వినియోగపరచుకో లేక అట్టి శక్తినుంచి ప్రయోజనాన్ని పొందలేక పోతున్నాడు.

పాండవులు ఎంతో అదృష్టవంతులు. పెద్దవాడైన ధర్మరాజు చక్రవర్తి పదవిని అలంకరించాడు. రెండవవాడైన భీముడు భుజ బలంతో మహాశక్తి మంతుడైయున్నాడు. మూడవ వాడైన అర్జునుడు దేవేంద్రుని కుమారుడై పరమాత్ముని అపార కృపకు పాత్రుడైనాడు. యుద్ధ రంగంలో సాక్షాత్ శ్రీకృష్ణ పరమాత్మయే అతని రథ సారథిగా సేవచేయటానికి సిద్ధపడ్డాడు. ఇన్ని అనుకూలతలు వున్నప్పటికీ పాండవులు తమ జీవితంలో ఎన్నో కష్టాలు పడ్డారు, చెప్పనలవి కాని ఇక్కట్లకు గురియైనారు. వారి జీవితాలు మనకు బోధిస్తున్నది ఏమిటి ? ఏక్షణంలో ఏమి విపత్తు వాటిల్లుతుందో, ఏ ఒక్కరు ముందుగా చెప్పలేరన్నది స్పష్టమౌతున్నది. సర్వము ఆ భగవ దిచ్ఛ ప్రకారమే జరుగుతూవుంటుంది. ఏది జరిగినా ఆ పరాత్పరుని ఇచ్ఛ ప్రకారమే జరుగుతుంటుంది.

నిజానికి ఆ భగవానుని నివాసం ఎక్కడ ? అన్నిచోట్ల. సమస్తజీవులలో వున్నది ఆయనే.

పరమాత్ముడు, సర్వవ్యాపి, సర్వజ్ఞుడు అని అంటారు. నిజం చెప్పాలంటే ఆయన ప్రేమస్వరూపుడు. అంతటా నిండివున్నది ఆ ప్రేమ స్వరూపమే. అందువల్లనే ఆయనను మనము తెలిసికోవాలని ఆకాంక్షిస్తున్నాము. ఆ ప్రేమ యొక్క అంశ లేకుంటే ఏజీవి లేదు. ఆనంద ధామానికి చేర్చే ఆ ప్రేమ పరమ పవిత్రమైనది, అనంతమైనది. చాలామంది వ్యక్తిగత సంబంధాల ద్వారా ఈ ఆనందాన్ని పొందాలని అనుకొంటారు. మరికొందరు కీర్తి, అధికారం, సంపదలు మున్నగు వానిని సంపాదించటం ద్వారా ఈ ప్రేమను చూరగొనాలని ప్రయత్నిస్తారు. కొద్దిమంది మాత్రము భౌతిక స్థితి గతులను ప్రాపంచిక సుఖములందలి కోరికను పరిత్యజించడం ద్వారా దీనిని పొందాలని ప్రయత్నిస్తుంటారు. అనాసక్తి ఒక్కటే ఇట్టి ఆనందాన్ని ప్రసాదించగలదు. త్యాగమే మహోన్నతమైన అమృతత్వాన్ని ఇవ్వగలదని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. సత్యమైన, శాశ్వతమైన ఆనందాన్ని ప్రసాదించగలిగేది పరిత్యాగం మాత్రమే. బంధుమిత్రులనే మమకార బంధాలన్నింటినీ త్రెంచుకోవాలి. అనురాగ, మమకార బంధాలనన్నిటినీ దూరంచేసికోవాలి. ఈవిధంగా భవబంధాలనుంచి విముక్తమైన హృదయ పీఠంపై అత్యంత వైభవోపేతమైన ఆపరమాత్మను ప్రతిష్ఠించుకోవాలి. అవ్యయానంద ప్రాప్తికి ఇదొక్కటే మార్గం.

ద్వారకలోని యాదవులు కృష్ణునిపై అనురాగాన్ని పెంచుకొన్నారు. కృష్ణుడు తమ బంధువు అనే మమకార బంధాలను పెంచుకొన్నారు. అందుకు వారెంతో సంతోషపడ్డారు. ఆ బంధుత్వం వారిలో గర్వాన్ని పెంచింది. చివరికి దాని ఫలితం ఏమైంది ? వారిలో వారే కలహించుకొని సర్వనాశనమైనారు. అశాశ్వతమైన భౌతిక సంబంధాలపై అభిమానం పెంచుకొన్న వారికి చివరకు ఇదే దుర్గతి పడుతుంది. ఐతే గోపికలు శ్రీకృష్ణుని తమ హృదయ మందిరాలలో ప్రతిష్ఠించుకున్నారు. నేను, నాది అనేది విస్మరించి ఆపరమాత్మునితో తాదాత్మ్యం చెందారు. అందువల్లనే వారికి లక్ష్యం సిద్ధించింది. ఆధ్యాత్మిక రంగంలో విజయ సాధనకు శరణాగతి ఒక్కటే శరణ్యం. ఆధ్యాత్మిక విజయసాధన యందలి రహస్యం ఇదే.

స్వర్గీయ ఎన్. నారాయణభట్ (లోక సేవా బృంద విద్యాసంస్థల వ్యవస్థాపకులు. ఈ విద్యాసంస్థల సముదాయాన్ని తర్వాత సత్యసాయి లోక సేవా ట్రస్టు స్వీకరించింది). ప్రజల మన్ననలను ఎంతగానో అందుకొన్నారు. కాని ఈ పొగడ్తలు ప్రేమకు సరితూగేవికావు. ఆయన ఏ ఆశయం కోసమైతే తన జీవితాన్ని అంకితం చేశారో దానిని సమధికోత్సాహంతో పూర్తిచేయాలన్న దీక్షవుంటే అదే ఆయన పట్ల ప్రేమ అనిపించుకొంటుంది. ఆయనతో బంధుత్వము లేదా మైత్రి వున్నదని నిరూపించుకోవటానికి ఇది ఒక్కటే సముచిత మార్గము. మీరు చేసే పనులను బట్టే మీవ్యక్తిత్వ నిరూపణ జరుగుతుంది. మీ ఆచరణ ముఖ్యం గాని, భగవంతుని నామాన్ని ఎంతకాలం జపించారు. లేక ఆభగవంతుని విగ్రహం ఎదుట ఎన్నిసార్లు సాష్టాంగ పడ్డారు ? అనేది లెక్కలోకి రాదు. మీరు చేసే పనులు, మీ ఆలోచనలంతు మీ మాటలకు అనుగుణంగా వుండాలి. అప్పుడే అది త్రికరణ శుద్ధి అనిపించుకొంటుంది

భక్తి అంటే నామాన్ని జపించటం, స్తోత్రాలను ప్రార్థన శ్లోకాలను పఠించటం అనుకొంటారు. దైవ ప్రీతి కోసంచేసే పూజలు, ఆచారాలు, భక్తిగా చలామణి అవుతున్నాయి. వీని ద్వారా భగవంతుని అనుగ్రహాన్ని పొందవచ్చునని భావిస్తుంటారు. భగవధ్యానం సైతం నిజమైన భక్తి అనిపించుకోదు. భగవంతుని దయకు పాత్రులైనంత మాత్రాన కూడ వారిని భక్తులనటానికి వీలు లేదు. ఇట్టి ఆధ్యాత్మిక

సాధనలన్నీ స్వార్థమనే చీకటి ముసుగులోనివే. మానవ సేవయే ఉత్తమమైన మాధవసేవ అని వ్యాస మహర్షి ప్రకటించారు. ఎవరికిగాని హాని తలపెట్టకు. ఎవరినీ కించపరచకు. అదే భగవంతుని పట్ల నిజమైన భక్తి అనిపించుకొంటుంది. నిజానికి ఎదుటివ్యక్తికూడా నీవేనని గ్రహించాలి. ఈ సత్యమును గుర్తించినప్పుడే ముక్తి. అదే మోక్షము. మీసంతోషము మీసంపద, మీజ్ఞానము మీకంటే తక్కువ స్థితిలోనున్నవారితో కలిసిమెలసి పంచుకోవాలి. ఈవిధంగా చేసినప్పుడు, అట్టివారికి దైవకృప తప్పక లభించగలదనడంలో ఎట్టి సందేహంలేదు.

భగవంతుని నీవు ఎంతగా ప్రేమిస్తావో, నీవు చేసే పనులలో కూడా అంతటి ప్రేమ కనపర్చాలి. నిజానికి నీవు అన్నం తింటున్నది నీలో నున్న "నేను" ను సంతృప్తి పరచటానికే. నీవు ధరించే దుస్తులు కూడా ఆ ''నేను'' ను సంతోషపెట్టడానికే. భర్త తన భార్యను ప్రేమించటం ఈ "నేను" కోసమే. భార్య తన భర్తను ఆరాధించటం కూడా ఆమె తనలోని ''నేను'' ను సంతోషపెట్టటం కోసమే. ప్రతి ఒక్కరి లోను, అనుక్షణం అంటిపెట్టుకొని వున్న ఈ "నేను" ఎవరు ? ఆ పరమాత్మయే. ''ఈశ్వరః సర్వ భూతానామ్ ......'' ఆ పరమాత్మ ప్రతి ఒక్కరి హృదయంలో వున్నాడని భగవద్గీత పలుకుచున్నది. ప్రతి ఒక్కరిలోని ఆత్మయే ఆ పరమాత్మ. నీవు నీ అజ్ఞానం వల్ల దానిని మనస్సు, దేహము అనే రెండు కోశములక్రింద మఱుగుపరచావు. మనస్సు, దేహము నిజమైన "నేను" గా భ్రాంతి చెందుతున్నావు. మూడు ''నేను'' లు వున్నాయి. నీవు, నేను అనుకొనే "నేను" ఒకటి. నిన్ను గురించి ఇతరులు భావించే ''నేను'' మరొకటి. నిజమైన ''నేను'' మూడవది. దేహమే ''నేను'', అని నీవు అనుకుంటావు. మనస్సే నీవు అని ఇతరులు భావిస్తుంటారు. నిజానికి నీవు ఈ రెండూ కాని ఆత్మవు. నీవు మాత్రమే కాదు. అందరూ ఆత్మ స్వరూపులే. ఒకే పరమాత్మ అంశలు. కాబట్టి ఏ ఒక్కరి గురించి చెడ్డగా భావించకు. ఏ ఒక్కరికి హాని కల్గించే పని చేయకు. ఇతరులకు కీడు కలిగించే పనులు తిరిగి నీకే కీడు కలిగిస్తాయి. "సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" అంటే ఏ దైవము నకు నమస్కరించినా అది ఆకేశవునికి చేరును అని అర్థము. ఇది మీరు విన్నదే. కాని నేను మరొకటి కూడా చెప్తూఉంటాను. "సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అంటే నీవు ఏ జీవిని బాధించినా అది ఆ పరమాత్మకే చేరుతుంది అని. ఇక్కడ 'కేశవ' అంటే అందరిలోనున్న ఆత్మవస్తువు. నీవు ఇతరులకు సేవ చేయజాలనిచో వారిదారిని వారిని పోనిమ్ము. హాని మాత్రము చేయకుము. ప్రతి ఒక్కరి హృదయము శాంతి కొఱకే పరితపిస్తున్నది. ప్రధాన మంత్రి నుంచి బిచ్చగానివరకు అందరూ శాంతిని కోరుతున్నారు. శాంతి అనేది బజార్లో కొనుక్కొనేందుకు దొరికే వస్తువు కాదు. ఏ పరిశ్రమలోను అది ఉత్పత్తి అయ్యేది కాదు. మనము చేసే పనుల వల్లనే మనకు శాంతి చేకూరాలి. ఆ చేసే పనులు కూడ ప్రేమ భరితమై వుండాలి. చేతిలో ఉప్పునీరు గల కప్పును పెట్టుకొని కేవలం నినాదాల వల్ల దానిని మధురంగా మార్చలేవు ఇది ఒక పవిత్రమైన ప్రదేశం. బాల బాలికలను సద్గుణ వంతులుగా తీర్చిదిద్దేందుకు మీరు చిత్తశుద్ధితో ప్రయత్నిస్తున్నందువల్లనే దీనికి అట్టి పవిత్రత వచ్చింది. పవిత్రమైన ఈ భారత భూమికి అర్హమైన బిడ్డలుగా ఈ పిల్లలను తీర్చిదిద్దడానికి మీరు అంకితులైనారు. ఈ దేశ అభ్యున్నతికి, శాంతి సౌఖ్యాలకు ఇది ఒక్కటే సరియైన మార్గము. రాజకీయాలు శక్తి హీనమైనవి. అవి మనలను కాపాడలేవు. యంత్ర, తంత్రాలు మనలను రక్షించలేవు. భారతీయ సంస్కృతికి సంబంధించిన పవిత్ర ఆదర్శాలను మన హృదయాలలో నింపుకొన్నప్పుడే శాంతి ధామంవైపు

పురోగమించ గలుగుతాము. నారాయణ సేవ (అన్నార్తులకు అన్నాదానం) నేడు ఎంతైనా అవ సరము. ఎక్కడ చూచినా అన్నం కోసం అలమ టిస్తున్న ఆర్తనాదాలు వినిపిస్తున్నాయి. ప్రతి ఒక్కరు కష్టపడి పని చేస్తే, ఈ సమస్య తలయెత్తేదే కాదు. కడుపుకు ఇంత తిండి కావాలిఅని మనం అంటూంటాం. ప్రతి కడుపు ఈ ప్రపంచంలోకి దిగేటప్పుడు రెండు చేతులను కూడా వెంట పెట్టుకుని వచ్చింది. ఆ చేతులకు పని చెప్పకపోతే కడుపుకు తిండి రాదు. కడుపుకు కావల్సిన తిండి సంపాదించటమే ఆ చేతుల పని. కాబట్టి కష్టపడి పని చేయాలన్నదే సందేశం. సంపాదించినది ఇతరులతో కలిసి పంచుకోవాలి. నీవు ఎంత ఎక్కువ శ్రమిస్తే అంత ఎక్కువ సంపాదించగలుగుతావు. అంత ఎక్కువ ఇతరులతో కలిసి పంచుకోగల్గుతావు. కష్టపడి పని చేయాలి. ప్రేమ భావనతో ఇతరులతో కలిసి పని చేయడమనేది అంతకంటే ముఖ్యం.

దక్షిణ కెనరాజిల్లా (కర్ణాటక)
ఆలికెలో శ్రీవారి ఉపన్యాసం
(25-1-1979)



# మనశ్శాంతికి మార్గము

## ( బొంబాయి భక్తులతో భగవాన్ )

భగవాన్ : మీ సాధన గురించి ఏమైనా ప్రశ్నలు అడగండి. సాధన విషయాల గురించి మీరు అడుగుతుంటే నాకెంతో సంతోషంగా వుంటుంది.

భక్తుడు : నా పరిస్థితి అల్లకల్లోలంగా వుంది. నాకు మనశ్శాంతి అనుగ్రహించండి స్వామీ !

గవాన్ : మనశ్శాంతి అనేది నీకు మరొకరు ఇచ్చేది కాదు. అది నీకు ఇతరులనుంచి లభించేది కాదు. అది నీ సహజ స్వభావమైయున్నది. నీవు అంతర్ముఖుడవైతే చాలు; దానంతట అదే నీకు లభిస్తుంది. స్వామి సైతం నీకు మనశ్శాంతిని ఇవ్వలేరు.

భక్తుడు : అలా కాదు స్వామీ! మీరు నాకు మన శ్శాంతిని తప్పక ప్రసాదించగలరు.

భగవాన్ : అవును. ప్రసాదించగలను. నేను ఇదివరకే నీకు దానిని ప్రసాదించాను. నీవు పుట్టినప్పుడే దానిని నీకు ప్రసాదించాను. కాని పుట్టిన తర్వాత నీవు పెద్దవాడవు అవుతున్నకొద్దీ ఈర్ష్య, ద్వేషం, దురాశ, గర్వం, అహంకారం వంటివి కూడా నీలో పెరుగుతూ వచ్చాయి. వయస్సుతో పాటు ఈ దుర్గుణాలను కూడా పెంచుకుంటూ వచ్చావు. అందువల్లనే నేను నీకు ప్రసాదించిన మనశ్శాంతి తరిగిపోతూ వచ్చింది. ఇప్పుడు అది మినుకు, మినుకుమంటూ వుంది.

భక్తుడు : సాక్షాత్కారము అంటే ఏమిటి స్వామీ ?

భగవాన్ : నీవు దేహము కావని, ఆత్మ స్వరూపుడ వని తెలుసుకోవడమే. కాలదూరాలకు, మనస్సుకు అతీతమైనదే ఆత్మ.

భక్తుడు : ధ్యానములో కనిపించే దృశ్యములు సాధనకు దోహదం చేసేవా లేక అవరోధములా?

భగవాన్ : సాధనవల్ల మనస్సునుండి ఆవిర్భవించే దైవీ భావనతరంగములే ఆ కనపడే దృశ్యములు. అవి నీ సాధన మార్గములో మైలు రాళ్ళవంటివి. గమ్యస్థానమునకు చేర్చే బాటపై కనపడే గుర్తుల వంటివి. అవి నీవెంట చివర వరకూ వెంబడించ రావు. వెంబడించవు. సాధనలో ఎదురయ్యే అవరోధములను నీ అంతట నీవే అధిగమిస్తూ పురోగమించాలి. సాధన ప్రయాణం ఎప్పటికైనా ఒంటరిగా సాగవలసిందే.

భక్తుడు : సాధనలో ఆధ్యాత్మిక అభ్యున్నతికి భగవదనుగ్రహము ఎంతవరకు పనిచేస్తుంది ?

భగవాన్ : నీ ఆత్మనుంచి లభించే అనుగ్రహమే అన్నిటికంటె ముఖ్యమైనది. అదే నీ సాధనకు తోడు. నేను నీపై అపార కృపను కురిపించవచ్చు. కాని నీ హృదయంలో మాలిన్యములు తొలగనప్పుడు, నీ మనస్సులో అహంకారము నిండివున్నప్పుడు దానివల్ల నీకెట్టి ప్రయోజనం వుండదు. మొదట ప్రేమతో నీ హృదయమును శుభ్రపరచుకొనుము. సేవతో నీలోని అహంకారమును దూరము చేసుకొనుము.

భక్తుడు : మనస్సును స్వాధీన పరుచుకొనుట ఎట్లు స్వామీ ?

భగవాన్ : అసలు మనస్సంటే ఏమిటో చెప్పు ! ఈ చేతిరుమాలు చూడు ! నూలు పోగులతో కలనేతగా తయారైనది. ఇందలి ఒక్కొక్క నూలుపోగును లాగివేసిన చివరకు చేతిరుమాలు అనేది వుండదు కదా ! అదే విధంగా మనస్సు కూడా. నీలోని కోరికలను ఒకటొకటిగా తీసివేస్తే మనస్సనేదే వుండదు. కోర్కెల సమష్టి రూపమే మనస్సు. మనస్సును మరొక విధంగా కూడా స్వాధీన పర్చుకోవచ్చు. మనస్సు ఇంద్రియముల ద్వారా విషయ సుఖములను అనుభవించుటకు ముందు బుద్ధి నుండి ఆదేశాలను తీసుకోవటం అలవాటు చేస్తే మనస్సు వల్ల నీకు ఎట్టి హాని వుండదు సరికదా అది నీకు ఆప్త మిత్రుని వలె సహకరిస్తుంది. సంకల్పముల సమూహామే మనస్సు కాబట్టి బుద్ధి సాంగత్యం వల్ల తత్వవిచారణ అలవడినప్పుడు దుష్టభావనలు తొలగి మనస్సు నిర్మల మగును. అప్పుడే మనశ్శాంతి.

భక్తుడు : మా అందరికీ నిర్మలమైన బుద్ధులను అనుగ్రహించరాదా స్వామీ!

భగవాన్ : మీకు కావలసినంత వివేకం వున్నది. సత్ చిత్ ఆనంద స్వరూపులే మీరు. చిత్ అంటే బుద్ధి. కాని దానిని మీరు దుర్వినియోగ పరచుకొంటున్నారు. దానికి మీరు అవరోధాలు కలిగిస్తున్నారు. మనస్సుపై పూర్తి అధికారం చెలాయించే హక్కు బుద్ధికి ఇవ్వండి. మనస్సు మీకు ఒక పని చేయుమని ఒక మార్గమును చూపవచ్చు. వెంటనే మీ బుద్ధితో ఆలోచించండి. మనస్సు నడక సరియైందా, కాదా అని ప్రశ్నించండి. సత్య వివేక శక్తి బుద్ధికి వున్నది. మిమ్ములను సరియైన మార్గములో నడుపుట దాని విధ్యుక్త ధర్మము. ఏది శాశ్వతము, ఏది అశాశ్వతము, ఏది మంచి, ఏది చెడు, అనే వివేకం మీకు కలుగుతుంది. మనస్సు చెప్పినట్లు విని చెడిపోకండి. బుద్ధితో సంప్రతించకుండా మనస్సు చెప్పిన మాటలు వింటే మీరు అధోగతి పాలవుతుంటారు.

భక్తుడు : స్వామీ! మేమందరం గాయత్రీ మంత్రము జపించ వచ్చునా ?

భగవాన్ : తప్పక చేయవచ్చు. గాయత్రీ మంత్రము జపించుటకు ఎట్టి నిషేధములు లేవు. అందులో మూడు భాగాలు వున్నాయి. అందలి మొదటి తొమ్మిది శబ్దములు_ఓం భూర్ భువ స్సువః తత్ సవితుర్ వరేణ్యం భర్గో దేవస్య – భగవంతుని గురించిన వర్ణన ఇది. ధియో యో నః ప్రచోదయాత్ – ఇది ప్రార్థనకు చిహ్నము. ముల్లోకములు వ్యాపించిన వివేకము యొక్క మహత్తర జ్యోతితో వెలుగొందుచున్న దైవశక్తిని ప్రార్థించటమే ఈ మంత్రార్థము. దీని వల్ల మనస్సు స్వాధీనం కావచ్చు.

భక్తుడు : ఆత్మ, పరమాత్మలకు తేడా ఏమిటి స్వామీ ? ఈ రెండు మాటలు కలగా పులగంగా వాడుతున్నట్లు అనిపిస్తుంది.

భగవాన్ : రెండూ ఒకటే. ఒక వస్త్రములో ప్రత్తి కలిసివున్నట్లు. ఒకటి రూపము. మరొకటి రూప రహితము. ఒకటి సగుణము. మరొకటి నిర్గుణము. నీలో వున్నది ఆత్మ. అది సర్వ వ్యాపి కూడా. సర్వవ్యాపకమైన ఆత్మ రూపమే పరమాత్మ. నీవిప్పుడు జాగ్రదవస్థలో వున్నావు. నీవు పడుకున్నప్పుడు బొంబాయిలో షాపింగు చేస్తున్నట్లు కల గనవచ్చు. కాని నీ దేహము మాత్రము ఆ క్షణములో పుట్టపర్తిలోనే వున్నది. దీనిని స్వప్నావస్థ అంటారు. నీవు గాఢనిద్రలో వున్నప్పుడు నీ మనస్సు కలలు గనే అవకాశం లేదు. స్పృహ లేని స్థితిలో నీ వెవరు అనేది కూడా తెలియకుండా వుంటావు. దీనిని సుషుప్తి అవస్థ అంటారు. ఈ మూడూ కాక తురీయమనే నాల్గవ అవస్థ కూడా వున్నది. ఈ అవస్థలన్నింటిలో ఆత్మ సాక్షిభూతమై యున్నది.

: పురుష ప్రయత్నము, ప్రారబ్ధము ఈ ఒక దానికొకటి ఎలా సరిపడతాయి ?

భగవాన్ : రెండూ ఒక్కటే. నీ బుద్ధి బలంతో నీ మనస్సును స్వాధీనపరచుకొని నీ ఇంద్రియములను ఆదేశించుటకు అనుసరించే విధానం ఇది. ఉన్నత లక్ష్యాల సాధనకు వాటిని నీవు తెలివిగా ఉపయోగించుకోవాలి. అప్పుడే నీ గమ్య స్థానాన్ని సురక్షితంగా చేరుకోగలవు. నీ ఇంద్రియములను వాటి ఇష్టానుసారము పోనిచ్చిన నీ భవిష్యత్తు అంధకార బంధురమౌతుంది.

భక్తుడు : మీకు సేవ చేసుకోవాలనే అభిలాషతో వచ్చాను. ఇక్కడ కాలేజీలోగాని, హాస్టలులోగాని తగిన పనికి మీరు నన్ను వినియోగించవచ్చు.

భగవాన్ : బంగారూ! నీవు ప్రస్తుతం బొంబాయిలో చేస్తున్న పని కూడా నా పనే. ఒక వస్త్రమును కత్తెరతో రెండు తుంపులు చెయ్యి. వస్త్రమును రెండు తుంపులు చేసినది కత్తెర కాదు సుమా! ఆపని చేసినది నీవే. అట్లే నిన్ను నాపనిముట్టుగా నాకు ఇష్టమైన ఏ రంగములో గాని ఉపయోగించుకోగలను. నాపట్ల ప్రీతితో నీవు నీ పనిని చేయుము. చేసే పనిని నీ కొరకు చేస్తున్నాననే భావన విడిచి పెట్టు. భారము నాపై వేసి చేయుము.

భక్తుడు : ఈ షిర్డీబాబా చిత్రముపై మీ సంతకమును కోరుచున్నాను.

భగవాన్ : ఏది ఇటివ్వు.

భక్తుడు : ఇది మీ స్వరూపమేనా స్వామీ ?

భగవాన్ : నీకు సందేహ మెందుకు? నీవు సయితము నా రూపమే. మీరందరూ నా స్వరూపులే. తీపి వస్తువులు విభిన్న నామరూపములతో, రంగులతో వేర్వేరు పదార్థములతో కలిసి వుండవచ్చు. అన్నిటిలోనూ వున్నది చక్కెర కాబట్టి అవి అన్ని తియ్యగా వుంటాయి. మీ అందరితో

దైవత్వం వున్నది. అదే మీ నిజ స్వరూపము. నా సన్నిధి నుంచి బయటకు వెళ్ళగానే మీరీ సత్యమును విస్మరిస్తూంటారు.

భక్తుడు : మీ సందేశమును అనుసరించుటకు ప్రయత్నిస్తాము స్వామీ.

భగవాన్ : వట్టి ప్రయత్నము పనికి రాదు. వట్టి ప్రయత్నము, ప్రయత్నం, ప్రయత్నం అంటే చివరకు అది వృత్తిదే అవుతుంది. ప్రయత్నము కాదు. చేయటం ప్రారంభించు. పని చేయటం ప్రారంభిస్తే నీకు నా ఆశీస్సులు వుంటాయి. విజయం తప్పక చేకూరుతుంది.

-సంపాదకుడు



# నమశ్శివాయ

ఆ.వె సత్యసాయి నేడు సాక్షాత్కరించెను
పుట్టపర్తియందు పుణ్య మహిమ
కోరి కొల్చువారి కోరిక లీడేర్చ
కల్పవల్లియనగ గణుతికెక్కె. 1

ఆ.వె దివ్యమహిమ జూపు దీనుల గాపాడు
శరణు జొచ్చువారి కరుణబ్రోచు
మానవాళి యొక్క మంచి కాంక్షించుచు
దానధర్మ పరత తగిలి నడచు 2

ఆ.వె ధర్మ మాచరించె దశరథ తనయుడు
ధర్మబోధ చేసె అచ్యుతుండు
ధర్మబోధ చేసి, ధర్మావలంబియై
సత్యపథము జూపె సత్యసాయి. 3

సీ॥ చిఱునవ్వు మోమున చిందులాడుచునుండు
కండ్లు వర్షించును కరుణవృష్టి
చికురజాలము జూడ చిత్రమై యెప్పుడు
ఆకర్షణీయమై అమరెనదియు
అభయ హస్త మెపుడు ఆర్తరక్షణనొసగు
అమృతత్వమునొసగు అంఘ్రియుగము
ఆత్మతేజము సర్వ నన్ని దిశలయందు
విభవమును గొలుపు వింతకాంతి

ఆ.వె మధుర వాక్కులందు, మందహాసమునందు
మంత్రశక్తి పుట్టి మదినిదోచు
అఖిలజనుల గావ అవతారమెత్తిన
చంద్రమౌళి వీవె, సత్యమరయ. 4

పుద్రేవు రాఘవేంద్రరావు,
సీలేరు

# రా మ రా జ్య ము

సీ॥ శ్రీనాథ నిత్యశ్రీ తృప్తి గల్గిన నీవు
పుట్టు గిట్టుల పట్టు పుట్ట నేల !
సృష్టికే తాతవై సృష్టిలో సుతునిగా
మాతాపితల యాజ్ఞ మనుట యేల !
విధుఁ నీవై లోక విభవార్థమగు నీవు
గురువుల సేవించు గోప్యమేల !
జగముల శాసించు శౌరివై జనముల
హృదయ మెత్తగ సాగు పదమదేల !

గీ॥ ఔర నీ నాటకంబది యజునికైన
నంతు తెలియనె ! తెలియ నే నెంతవాడ
జగతి సృష్టించి నీవు, నా జగతి కొరకు
నవతరించెదు నీ లీల లవి ఘనమ్ము.

సీ॥ తల్లిదండ్రులు రాజ్య ధనము లీయక యున్న
వారాత్మ నెత్తు సద్వర్తనంబు !
గురులొప్పగా నేర్చి కోరికలను దీర్చు
ప్రజ్ఞార్థముల నీయు పాటవంబు !
సకల జనోద్ధరసవనంబు లన్నియు
నిర్వహించన్ గల్గు నిగ్రహంబు !
నేకమై లోకంబు లెదిరించ వచ్చెనా ?
నొక్కడై గెలుపొంద నోర్చు బలము !

గీ॥ ధరణి నేవర్గమైనను శరణు శరణ
మనుచు కోరిన నెరవేర్చు నర్థబలము
గలిగి లోకంబు నందిది గలుగ నేర్పు
నిల్పు నాదర్శమందును వెల్పువనగ
కీర్తి గాంచిన శ్రీరామమూర్తి నీకు
సాటి నీవయ్య లేరు నీ సాటి; నెన్న
నవతరించుము నీ ధర్మమందు మమ్ము
రక్ష సేయంగ రా ! రామ రాజ్యమనగ.

గాధిరాజు, పాలమూరు.

# సంసార సాగరాన్ని జ్ఞాననౌకతో దాటాలి

"ప్రేమరూపము బ్రహ్మంబు ప్రేమమయము
ప్రేమ ప్రేమతో సంధింప నీమమగును
కాన ప్రేమను పూర్తిగా కలిగియున్న
అద్వితీయము చేరంగ నర్హుడగును."

పారమార్థికాన్ని, పరతత్వాన్ని స్వయంగా గుర్తించగోరే వారికి ప్రధానంగా చిత్తశుద్ధి వుండాలి. ప్రకాశవంతము, పరిశుద్ధమైన గదిలో విష క్రిములు చేరుటకు వీలుండదు. పవిత్రమైన జ్ఞానంవున్న చిత్తంలో కామ, క్రోధ, ద్వేష, అసూయ వంటి దుర్గుణాలు ప్రవేశించవు.

బొగ్గును తెల్లబరచాలని పరిశుద్ధమైన పాలతో కడిగితే పాలు మాలిన్యం చెందును కాని బొగ్గు తెల్లబడదు. చీకటిని దూరం చేసుకోవాలంటే దీపం అవసరం. అజ్ఞానం నిర్మూలం చేసుకోవాలంటే జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవాలి.

అజ్ఞానం బొగ్గు కాదు. అది రాగికి పట్టిన చిలుం వంటిది. దీనిని కడిగి వేస్తే అశుద్ధం పోవుటకు వీలున్నది. అజ్ఞానం బియ్యానికి కప్పుకున్న పొట్టు వంటిది. దంచటంతో పొట్టు దూరమవుతుంది. అజ్ఞానం అనే పొట్టును జ్ఞానసాధనచే దూరం చేసుకోవచ్చును.

అర్జునా! సర్వకర్మలు కూడా జ్ఞానంలో లీనం కావలసిందే.

## గుణధర్మాలు ఫలాపేక్షములు

పవిత్రజ్ఞానార్జన నిమిత్తమై యజ్ఞయాగాదులు, క్రతువులు చేస్తారు. అశ్వమేధ, రాజసూయ యాగాలు వ్యయంతో కూడుకున్నవి. ఇవి సామాన్య మానవులకు అందుబాటులో లేనివి. అంతేకాక జ్ఞానతపస్సు, జ్ఞాననౌక, జ్ఞానాగ్ని, జ్ఞానఖడ్గం, వీటిని కూడా యజ్ఞాలుగా రూపొందిస్తూ ఆనందాన్ని అనుభవిస్తున్నారు.

యజ్ఞములన్నీ భౌతిక ఫలములు అందించే, అందుకునే నిమిత్తం ఆచరిస్తారు. ఇవన్నీ గుణధర్మాలే కానీ విశ్వస్వరూపమైన ఈశ్వర ధర్మం కాని, సామాజిక ధర్మం కాని కాదు. గుణాధర్మాలన్నీ వాంఛలతో, ఫలాపేక్షతో కూడుకున్నవే.

ఫలాపేక్షరహిత కర్మ ఆచరించడమే జ్ఞానయజ్ఞం. ఇది సర్వమానవులు, జాతి, మత, కుల విభేదాలు లేక ఆచరించవచ్చును. ఈశ్వరార్పితముగా గావించే ప్రతి కర్మ జ్ఞాన యజ్ఞమే. అర్జునునిలో జ్ఞానజ్యోతిని వెలిగించే నిమిత్తం కృష్ణుడు ప్రయత్నిస్తున్నాడు.

## వత్తి నూనె వున్నా, అంటించే వ్యక్తి లేకుంటే ఎలా?

మనం జ్యోతిని వెలిగించాలంటే ఒకటి ప్రమిద, రెండు నూనె, మూడు వత్తి కావాలి. నాల్గవది నిప్పు. ఈ నాలుగు వున్నప్పుడే జ్యోతి వెలిగించవచ్చు. కాని వెలిగించే వ్యక్తి లేకుంటే ఇవి నిరుపయోగములు. పువ్వులు, దారం, సూది వుంటే హారం తయారవుతుందా? స్వర్ణం, రత్నాలు వుంటే నగలు నిర్మాణం అవుతాయా? వత్తిని అంటించడానికి, హారం కట్టడానికి, నగ తయారు చేయడానికి ఒక వ్యక్తి కావాలి.

అర్జునా! నీయందు నాలుగు పదార్థాలు సిద్ధంగా వున్నాయి. ఏమిటి ఈ నాలుగు పదార్థాలు? ప్రమిద వైరాగ్యం, తైలం భక్తి, ఇంద్రియ నిగ్రహం వత్తి, ఆత్మవిచారం ఇందులోనిప్పు. వీటిని అందించే కృష్ణుడు ప్రక్కనే వున్నాడు. నాలుగు గుణాలు వుండటంచేతనే నీవు ధర్మబోధనకు జ్ఞానార్జనకు అర్హుడవు.

## జగత్తులో వర్ణ సృష్టి

ఇట్టి జ్ఞానజ్యోతి జగత్తులో శాశ్వతంగా వెలిగే నిమిత్తమే నాలుగు వర్ణాలు సృష్టిస్తున్నాను. కారణం? సామాజిక ధర్మం, విశ్వధర్మం, ఈశ్వర ధర్మం సక్రమంగా పరిపాలించేందుకు నాలుగు వర్ణాలు సృష్టిస్తున్నాను. ఈ నాలుగు వర్ణాలు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అన్న పేర్లతో వున్నాయి. నిత్యమైన సత్యమైన శాస్త్రాన్ని నడిపించేవారు బ్రాహ్మణులు. దేశం కొరకు దేహం అర్పించేవాడు రాజు. అందుకే వారు క్షత్రియులు. ధన ధాన్యాలు కలిగి ధర్మగుణంతో వెలిగేవారు ఆర్యవైశ్యులు. వ్యవసాయం వృత్తిగా సుఖజీవనం చేసేవారు శూద్రులు.

అనగా శిరస్సు బ్రాహ్మణులు, క్షత్రియులు భుజములు, వైశ్యులు తొడలు, శూద్రులు పాదములు. ధర్మసంరక్షణార్థం, ధర్మరక్షణకు ఈ నాలుగు తమ తమ కర్తవ్యాలు నిర్వర్తించాలనే సూత్రం నిరూపించాడు కృష్ణుడు. ఏయే భాగం కర్తవ్యం ఆయా భాగం చేస్తూ వేరొక భాగం నిర్వర్తించే కర్తవ్యానికి కూడా దోహదంచేసే శక్తి వీటికి యిస్తున్నాడు. తెగకు, సంఘానికి, జాతికి ఏ ప్రమాదం సంభవించినా మిగిలిన అంగాలు కూడా బాధపడుతాయి; విచారపడతాయని నిరూపించాడు కృష్ణుడు. ధర్మాన్ని నిర్వర్తించడమే వీటి కర్తవ్యం.

## కాలికి ముల్లు కుచ్చుకుంటే కన్ను ఏడుస్తుంది

దారిలో నడుస్తున్నప్పుడు ఒక ముల్లు కనిపిస్తుంది. తక్షణం అంతః సంబంధభావంచే కన్ను కాలికి చెప్పడంతో కాలు దాటుకుంటుంది. మరొక విధంగా చూస్తే కాలుకు ముల్లు కుచ్చుకుంటే కన్ను ఏడుస్తుంది. ఇదేవిధంగా నాలుగు వర్ణాల సంబంధాన్ని నిరూపిస్తున్నాడు కృష్ణుడు.

తొడలకు, భుజాలకు నొప్పి కలిగితే ముఖం బాధ పడుతుంది. ఏ విధమైన బాధ ముఖమునకు సంభవించినా కాళ్ళు బాధపడతాయి. ఈ దేహాంగముల అన్యోన్య సంబంధాన్ని అభివృద్ధి పరచుకుని ఈశ్వర ధర్మాన్ని రక్షించాలి. అంతేకాని నేను గొప్ప, నీవు చిన్న అని పోట్లాడుకునేందుకు, యుద్ధం చేసుకునేందుకు ఈ వర్ణాలు స్థాపించలేదు.

పాదాలలో, తొడలలో, భుజాలలో ఒకే ఒక్క గుండె ఉంది. ఒకే ఒక్క రక్తం ప్రవహిస్తూ ఉంది. ఒకే రక్తం ప్రవహిస్తున్న అంగాలలో ద్వేష పూరిత వాతావరణానికి అవకాశం లేదు. కనుక బ్రాహ్మణులు ప్రత్యేక తెగకాదు. ముఖమునకు బ్రాహ్మణులని పేరు. దేశ సంరక్షణ చేసేవారు క్షత్రియులు. శిరస్సును భుజాలను, మోస్తున్నది తొడలు. అనగా క్షత్రియులకు బ్రాహ్మణులకు ఆహారం అందిస్తూ అండదండలుగా నిలిచేవారు వైశ్యులు అని అర్థం. ఇవన్నీ పాదాల ఆధారం లేక నిలువలేవు.

ఈ విధంగా అర్థం చేసుకోక, రకరకాలుగా పోట్లాడుకుంటున్నారు అర్జునా! వర్ణాల అంతరార్థం గుర్తించి ప్రపంచానికి ప్రబోధించేందుకు నీవు పూనుకోవాలి. అనగా జ్ఞానం, శక్తి బలం నిర్మాణం సర్వం దైవ సంకల్పమే. సంసార సాగరంలో కుమిలే మానవుడిని ఆవలి ఒడ్డుకు చేర్చేది ఈ జ్ఞాన నౌకయే. దీనినే జ్ఞానాగ్నిఅన్నాడు కృష్ణుడు. అగ్ని అజ్ఞానాన్ని

భస్మం చేసి దివ్యత్వాన్ని ప్రసాదిస్తుంది. అగ్నిలో మంత్రపూరితంగా ఏదైనా చేసినప్పుడు అదికూడ అగ్ని స్వరూపమే స్వీకరిస్తుంది.

## ఎట్టి ఆహారమో, అట్టి తెలివి

ఎట్టి మంటో అట్టి పొగ. ఎట్టి పొగో అట్టి మేఘం, ఎట్టి మేఘమో అట్టి వర్షం. ఎట్టి వర్షమో అట్టి పంట, ఎట్టి పంటయో అట్టి వంట, ఎట్టి వంటో అట్టి తల. అందుకే తెలివి వంటపై ఆధారపడుతుంది. సాత్వికాహారంతో సాత్విక గుణాలు అభివృద్ధి చెందు తాయి.

## జ్ఞాన ఖడ్గం

ఇంక జ్ఞానఖడ్గం. అరిషడ్వర్గాలు మహావృక్షంగా పెరిగి మానవత్వాన్ని మరపింప చేస్తున్నాయి. జ్ఞాన ఖడ్గం ద్వారా ఆ వృక్షాలను ఖండించి ప్రశాంత జీవితానికి బాట ఏర్పరచుకోవాలి. కనుక నాల్గవ అధ్యాయంలో జ్ఞానయోగంలో పవిత్ర వర్ణాలను గురించి, యజ్ఞాలను గురించి వివరిస్తూ నీవు చేయ వలసింది జ్ఞాన యజ్ఞమే అన్నాడు కృష్ణుడు.

స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు ఈ పవిత్ర యజ్ఞాన్ని ఈశ్వరార్పిత బుద్ధితో చేయడమే జ్ఞాన కర్మగా రూపొందుతుంది. ఈ యజ్ఞానికి గుణం ప్రధానం. తల హృదయం. భావాలే అర్పితములు ఆనందం ఫలం. బ్రహ్మానంద నిమిత్తం, పరమా నంద నిమిత్తం ఆచరించే కర్మలు ఇవియే.

నేను ఏవరు ? ఎక్కడినుండి వచ్చాను ? అని ప్రశ్నించుకోవాలి. ఎవరికి ఎవరూ లేరు. ఇవి కేవలం అభిమానంతో, మమకారంతో వచ్చినవే. ఈ సంబంధాన్ని గుర్తించి నా మిత్రులు, గురువులు అని భ్రమించడం పొరపాటు, వెర్రితనం. నీవు చంపువాడు కాదు చచ్చువాడు కాదు.

## పాతవస్త్రం పారవేస్తే ఏం ?

పాత వస్త్రాన్ని పారవేస్తే ఎవరు విచారిస్తారు? ఈ దేహములు పాతవస్త్రాలు. అప్పుడు అర్జునునకు ఒక సందేహం పుట్టింది. స్వామీ 80,90 సంవత్సరాల వృద్ధులు అయితే పాత దేహం అనవచ్చుకాని, యువక దేహాన్ని కూడా ఎలా పాత వస్త్రమని చెప్పవచ్చు అని అడిగాడు.

కృష్ణుడు చిరునవ్వు నవ్వి ఇలా సమాధాన మిచ్చాడు.

## యువకుడైనా దేహం పాతదే !

అర్జునా! ఏది కొత్త, ఏది పాత అని నిర్ణయించే అధికారం నీకు లేదు అన్నాడు కృష్ణుడు.

ఒకవస్త్రాన్ని ఎప్పుడో తెచ్చుకున్నావు. బీరువాలో దాచుకున్నావు. కొన్నాళ్ళకు దాని విషయం మరచి పోయావు మళ్ళీ ఎప్పుడో బీరువా తెరిస్తే అది కనిపించింది. దాన్ని టైలర్‌కు ఇచ్చి కొత్తకోటు కుట్టించుకున్నావు. ఏదో పనిమీద వంగినప్పుడు కోటు చినిగి పోయింది. ఇక్కడ కోటు కొత్తదే. కాని గుడ్డ స్టాకు పాతది. కానీ ఇది నీకు కొత్త కోటువలె కని పిస్తున్నది. ఎన్నో జన్మలు ఎత్తివచ్చిన దేహం ఎవరికైనా పాతదే. శరీరం కేవలం కూలి రాలే పాత వస్త్రం.

పుట్టిన దేహానికి గిట్టుట సహజం. దీనికి బాధ పడుట అజ్ఞానుల లక్షణం. అజ్ఞాన నిర్మూలనకు జ్ఞానం అవసరం. ఈ విధమైన జ్ఞాన యజ్ఞం అర్జునునకు ప్రబోధించి యుద్ధంలో అర్జునుడిని ప్రవేశ పెడుతున్నాడు కృష్ణుడు. బంధువులతో యుద్ధం చేస్తున్నట్లు కాక నీలోని దుర్గుణాలతో యుద్ధం చేస్తు న్నట్లు భావించు. ఈ దుర్గుణాలు దొంగలుగా చేరి దొరలుగా ప్రవర్తిస్తున్నాయి. దొంగలను సంహారం చేసే నిమిత్తం నన్ను తలుస్తూ యుద్ధం చేయమని ప్రబోధించాడు కృష్ణుడు.

గీతా వాక్యాలను, జ్ఞానకర్మను, అర్థంచేసుకోవాలని, భగవాన్ సత్యసాయి బాబా ప్రబోధించారు.

బృందావన్
29-5-79

## దసరా మహోత్సవములు (1979)

(సెప్టెంబర్ 22 నుండి అక్టోబర్ 1వ తేదీ వరకు)

ప్రశాంతినిలయంలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి దివ్యసమక్షములో 1979 సంవత్సరపు దసరా మహోత్సవములు జరుపబడును.

22వ తేదీన కలశ స్థాపన, 25వ తేదీన వేదపురుష సప్తాహ జ్ఞానయజ్ఞ ప్రారంభోత్సవం, అక్టోబర్ 1వ తేదీ, విజయదశిమి పర్వదినమున పూర్ణాహుతి జరుగును. నిత్యం సాయంత్రం ఆధ్యాత్మికోపన్యాసములతోబాటు భగవాన్ తమ దివ్యోపన్యాసములతో భక్తులననుగ్రహించెదరు.

సం॥

## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | గీతావాహిని | 3-50 | 0-30 |
| 3. | ధ్యాన వాహిని | 1-50 | 0-15 |
| 4. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 5. | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 6. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 7. | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| 8. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 9. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 10. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 11. | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 12. | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 13. | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 14. | భజనావళి | 2-00 | 0-20 |
| 15. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 16. | ఆధ్యాత్మిక బోధిని | 1-00 | 0-10 |
| 17. | బాల వికాస్ బోధిని | 2-00 | 0-20 |
| 18. | నీలగిరి వేసవి వెన్నెల | 2-00 | 0-25 |
| 19. | సందేహ నివారిణి | 2-00 | 0-25 |
| 20. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |

ఆంధ్ర రాష్ట్రపు, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యస్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యస్. కస్తూరి, యం. ఏ., బి. యల్.

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134.

పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు

ఇండియా

| | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | | 14 | | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | | 20 | | 20 |
| బర్మా | 16 | 26 | | 12 | | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | | 18 | | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | | 20 | | 20 |
| శ్రీలంక | 8 | 21 | | 10 | | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసునందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

B(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన, రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. **V.P.P.** ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

---

( పుస్తక సూచి : 216 వ పుటలో చూడండి )

**విచక్షణా జ్ఞానము నుపయోగించిన నీ దుర్గుణము లన్నియు మటుమాయ మగును.**

ఆ 'నేను' అనునదే 'ఆతను' అను పరబ్రహ్మగా గుర్తింపుము. క్రోధము, ఈర్ష్యా సూయలు లేని, అహంకార రహిత సాధనవల్లనే ఇది సాధ్యమగును. కోపము వచ్చినప్పుడు దయ్యము పట్టిన వానివలె ప్రవర్తింతువు. నీ మోహము భయంకరముగా మారిపోవును. హెచ్చరిక చేయు ఎర్రబల్బువలె కన్నులు అగ్నిగోళములుగా తయారగును. ఆ హెచ్చరికను నీవు మన్నించి, ఏదైన ప్రశాంత ప్రదేశమునకు పోయి విశ్రాంతి తీసికొనుము. అంతియేగాని విచక్షణలేని వదరుబోతుతనము చేయకుము. అహంకారముతో ఈర్ష్యాసూయలు తల యెత్తును. అట్టి సమయములలో నీవు చాల క్రమశిక్షణతో మెలగవలెను. విచక్షణా జ్ఞానము నుపయోగించిన, కప్పపిల్లయొక్క తోక హరించి పోయినట్లు నీ దుర్గుణములన్నియు మటుమాయమగును. కప్పయొక్క తోక దానంతట అదే రాలిపోవలెను. నీవు దానిని కత్తిరించిన కప్పయే చనిపోవును. అదే విధముగ నీ విచక్షణా విజ్ఞానముల వలన నీలోని దుర్గుణములను తోకలు వాటంతట అవే రాలిపోవును.